


సంపుటి: 4 సంచిక: 2 పుటలు: 68 విడి ప్రతి వెల: 30 రూ. ఫిబ్రవరి-మార్చి 2018



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhrapradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2018-2020

**స్ఫూర్తి :** యు. సుబ్బరాజు

**సంపాదకులు:** నారాయణ శర్మ

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు : 9491870753

రాధా స్కూల్ (అనంతపురం) లో చదివే పిల్లలు

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

బి. అశోక్: 9963571510

కె. మల్లికార్జున: 9000453887




# విషయ సూచిక





ముఖచిత్రం: చలిమంట

చిత్రకారుడు: శివరాం ప్రసాద్

కొత్తపల్లి 97 వ పుస్తకం!




---

వనే రణే శత్రు జలాగ్ని మధ్యే
మహార్ణవే పర్వత మస్తకే వా ।
సుప్తం ప్రమత్తం విషమ స్థితం వా
రక్షంతి పుణ్యాని పురాకృతాని ॥

సంస్కృత మూలం
(భర్తృహరి)

కాననమున రణమున సలి
లానల రిపు మధ్యమున మహా-
బ్ధి నగాగ్ర స్థానమున సత్తు నిద్రితు
బూనికతో బూర్వ పుణ్యములు రక్షించున్

తెలుగు అనుసరణ
(ఏనుగు లక్ష్మణ కవి)

భావం: మహారణ్యంలో గానీ, భయంకరమైన యుద్ధం మధ్యలో గానీ, అంతులేని సముద్రంలో గానీ, ఎగసి పడే మంటలలో గానీ, పర్వతాల కొనల మీద దిక్కు తెలియని చోట్ల గానీ, నిద్రలో ఉన్నా సరే, మత్తులో ఉన్నా సరే, ఎంతటి ప్రమాదకరమైన పరిస్థితిలో ఉన్నా సరే - మనం గతంలో చేసిన మంచిపనుల ఫలితమే మనల్ని కాపాడుతుంది.

# ఇష్టంగా పని చేద్దాం!



దక్షిణాఫ్రికానుండి ఒకసారి గాంధీ ఏదో పని మీద ఇంగ్లాండ్‌కి వెళ్ళాడు. లండన్‌లో ఉంటున్న భారతీయులు కొందరు ఆయన్ని ఒక మీటింగుకు పిలిచారు. "దక్షిణాఫ్రికాలో మీ పోరాటం గురించి చెప్పాలి" అన్నారు వాళ్ళు. మీటింగుకు వచ్చే వాళ్ళంతా విద్యార్థులూ, విప్లవకారులూనూ. అందరూ 'మన దేశానికి స్వాతంత్ర్యం ఎలా తేవాలి?' అని ఆలోచిస్తున్న వాళ్ళు. దక్షిణాఫ్రికాలో గాంధీ చేస్తున్న పనులను గురించి వాళ్ళు విని ఉన్నారు. "ఆయుధాలు లేకుండా, ఆవేశం లేకుండా పోరాటం ఎలా చేస్తారు, ఎవరైనా?" అని వాళ్లకు ఆశ్చర్యం. ఆ వివరాలు గాంధీ ద్వారా నేరుగా వినాలని వాళ్ల కోరిక. "నచ్చితే ఆ విధానాలను భారతదేశంలో కూడా అమలు చేయచ్చు" అని వాళ్ల ఆలోచన.

సామాన్యంగా ఇలాంటి మీటింగుల కోసం అందరూ ఎక్కడెక్కడి నుండో వచ్చి జమ అవుతారు. స్థానికులు, యువకులు ముందస్తుగా వచ్చి, అందరూ తినేందుకు, త్రాగేందుకు ఏర్పాట్లు చేస్తారు. ఎవ్వరూ ఒకరికొకరు గట్టిగా తెలియరు కూడా. ఇక సమయం అవుతుందనగా పెద్దలు, అతిథులు వస్తారు. అంతా భోజనం చేసాక, అతిథులు మాట్లాడతారు; ప్రశ్నలు-జవాబుల కార్యక్రమం ఉంటుంది; కొన్ని కొన్ని పరిచయాలు అవుతాయి. తర్వాత అంతా ఎవరి దారిన వాళ్లు పోతారు.

"ఓ వస్తాను" అన్నాడు గాంధీ. "ఇక్కడ నాకు వేరే పనేమీ లేదు; కాబట్టి ఇది బాగానే ఉంటుంది: అయితే రెండు షరతులు- భోజనం కేవలం శాకాహారమే అయి ఉండాలి. మాంసం ఉండకూడదు; సారాయి కూడా ఉండకూడదు!" అన్నాడు.

ఆ వచ్చిన వాళ్ళు 'సరే' అన్నారు. మీటింగు ఫిక్స్ అయ్యింది: "దక్షిణాఫ్రికా నాయకుడు గాంధీ అధ్యక్షత వహిస్తాడు. ఎవరైనా రావచ్చు. స్వాగతం" అని లండన్ అంతటా ప్రచారం జరిగింది. "వీలైనవాళ్లు కొంత ముందుగా వస్తే, సభకు కావలసిన ఏర్పాట్లలో పాలు పంచుకోవచ్చు" అని కూడా రాసారు.

ఉత్సాహం ఉన్న వాళ్ళు కొందరు ఐదారు గంటల ముందే సభా స్థలికి చేరుకున్నారు. ఏర్పాట్ల బాధ్యత తీసుకున్న స్థానికులెవరో ఆ వచ్చినవాళ్లందరికీ పనులు పంచారు. గిన్నెలు, తప్పేలాలు శుభ్రం చేసుకోవడం, కూరగాయలు తరగటం, వంటపని- అన్నీ జోరుగా మొదలయ్యాయి.

కార్యక్రమం ప్రారంభమయ్యే సమయం దగ్గర పడింది. కుర్రవాళ్ళు కొందరు గేటు దగ్గర నిలబడి గాంధీ కోసం ఎదురు చూడటం మొదలు పెట్టారు. గాంధీ జాడ లేదు. "ఎవరైనా వెళ్ళి పిల్చుకొని వస్తే సరిపోయేది. దారి తెలుసో తెలీదో?" అన్నారొకరు. "ముఖ్య అతిథి కదా, కొంచెం ఆలస్యంగా వస్తాడేమో!" అన్నారొకరు. "ఇంతకీ ఆయన్ని పిలిచిన వాళ్లేరి, నేనైతే ఆయన్ని ఎప్పుడూ చూడలేదు" అన్నాడు ఒకాయన. "మేమూ చూడలేదు" అన్నారు మిగతా వాళ్ళు. అందరూ హడావిడిగా పోయి, గాంధీని పిల్చిన నిర్వాహకుల్లో ఒకరిని పిల్చుకొచ్చారు గేటు దగ్గరికి. సభకు ఇంకా ఐదే నిముషాలు ఉన్నది కానీ సభాధ్యక్షుడే లేడు!

"వచ్చేస్తూ ఉంటాడులే! భోజనం పనులు ఎంతవరకు వచ్చాయి?! తీరా అతిథులు అందరూ వచ్చాక, అప్పుడు ఇంకా వంట కాలేదంటే బావుండదు" అంటూ వంట గదిలోకి దారి తీసాడు నిర్వాహకుడు.

లోపల గాంధీ వంట పనిలో బిజీగా ఉన్నాడు! అందరూ ఎవరికి అప్పగించిన పనులు వాళ్ళు చేసుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ నవ్వుతున్నారు. వాళ్లందరితో కలిసి గాంధీకూడా వంట చేస్తున్నాడు! అది చూసిన నిర్వాహకుడు ఒక క్షణం బిత్తరపోయాడు.

తేరుకొని, "అదిగో! అక్కడ వంట చేస్తున్న మనిషే, గాంధీ!" అని నిర్వాహకుడు అరిచే సరికి అందరి చూపులూ గాంధీ మీదికి తిరిగాయి. "ఇంత సేపటినుండీ తమతో కలిసి పనిచేస్తూ, సరదాగా మాట్లాడుతున్న వ్యక్తి గాంధీనే!" అని గుర్తించి వాళ్ళంతా నోళ్ళు ఎండబెట్టారు.



"అయ్యో! మీరని మాకు తెలీలేదు. క్షమించండి. ఈ వంట పనంతా మీకెందుకు, ఆపండి- వేరే వాళ్ళం మేం చేస్తాం" అంటూ గాంధీని వారించబోయారు అందరూ. "ఏం ఫర్వాలేదు- వంటపని బాగుంటుంది- ఇంక ప్లేట్లు పెట్టేసెయ్యండి- అందరం తినేసి, ఆపైన మాట్లాడుకోవచ్చు" అన్నాడు గాంధీ.

పనులన్నీ బరువు కావు. జాగ్రత్తగా చూస్తే ఒక సంగతి అర్థం అవుతుంది: మనకు ఇష్టం లేని పనులు బరువనిపిస్తాయి.., కానీ, ఇష్టంగా చేసే పనులు ఏవైనా సరే, తేలికౌతాయి! అంతే కాదు, అవి మనకు సంతృప్తిని, ప్రశాంతతతో కూడుకున్న జ్ఞానాన్ని ఇస్తాయి!

గాంధీ లాంటి వాళ్ళు అన్ని పనుల్నీ గౌరవించారు. వాటిలో ఎక్కువ తక్కువలు పెట్టుకోలేదు. మేకలకు స్నానం చేయించటాన్ని, దారం వడకటాన్ని, పొలం పనిని, చదువు చెప్పటాన్ని, తమ పరిసరాలను శుభ్రం చేసుకోవటాన్ని, సొంతంగా చదవటాన్ని, రాయటాన్ని, మాట్లాడటాన్ని, పోరాటాన్ని అన్నిటినీ ఇష్టపడ్డారు. అన్నిటినీ గౌరవించారు.

మనం కూడా అట్లా ఉండగల్గితే నిజంగా బాగుంటుంది- కదూ?

పనులను గౌరవించే వాళ్లందరికీ నమస్కారాలు!

కొత్తపల్లి బృందం






# మట్టి వాసన

*బిట్టు కథలు*

*రచన: శ్రీమతి అనురాధ నాదెళ్ళ, పోరంకి, విజయవాడ.*

నేపథ్యం : ఢిల్లీలో ఉండే బిట్టు సెలవల్లో అమ్మమ్మ ఊరు పోరంకికి వచ్చాడు. తెలుగు ఇప్పుడిప్పుడే నేర్చుకుంటున్నాడు కదా, చాలా అనుమానాలు వస్తుంటాయి వాడికి. ఇక ఊళ్లో సైకిల్ రిపెయిర్ షాపు నడిపించే వీరబాబు కూతురి పిల్లలు దావీదు, చిట్టి. 'వాళ్ళు చదువుకోవాలి' అని వీరబాబు కోరిక. ఇక చదవండి..

మొదటి రోజు దావీదు అయిష్టంగానే వచ్చాడు. వాడు వీరబాబుతో చెప్పాడుట, 'నేను సైకిల్ పని బాగా నేర్చుకుని, పెద్ద కొట్టు పెట్టుకుంటాను, చదువొద్దు' అని. 'కానీ చదువు ఎందుకు అవసరం' అని బిట్టు వాళ్ల తాతయ్య వివరంగా చెప్పారు అందరికీ: "ఏ

పని చేసినా కొంచెం చదువు, కొంచెం ఆలోచన ముఖ్యం. ఆ కొంచెం చదువు కూడా లేకపోతే ఆలోచించే శక్తి సరిగ్గా రాదు. అంతేకాదు, ఈ రోజుల్లో చదువుకుంటే మంచి ఉద్యోగం వస్తుంది; జీవితం బావుంటుంది. మరొకరికి సాయం చేసే అవకాశం ఉంటుంది కూడా" అని. పిల్లలు ముగ్గురూ బుద్ధిగా విన్నారు.

తాతయ్య చెబుతుంటే మెల్ల మెల్లగా తెలుగు అక్షరాలు నేర్చుకోవటం మొదలెట్టారు బిట్టు, దావీదు. అప్పటికే చిట్టికి తెలుగు చదవటం, రాయటం వచ్చు బాగానే. అందుకని ఇప్పుడు తను వీళ్ళతోబాటు కూర్చొని ఇంగ్లీషు అక్షరాలు, హిందీ అక్షరాలు మొదలెట్టింది.

కొన్ని రోజులు గడిచే సరికే చాలా మార్పు వచ్చింది. పిల్లలిద్దరికీ కూడా చిన్న చిన్న పదాలు చదవటం వస్తోంది ఇప్పుడు. తాతయ్య రోజూ వాళ్లకి వార్తా పత్రిక హెడ్డింగులు చూపించటం మొదలు పెట్టాడు. వాటిలో కొన్ని పదాలు, కొన్ని అక్షరాలు గుర్తు పట్టటం, చదవటం, ఫలానా పదం ఎక్కడ ఉన్నది? అని ఒకరు అడిగితే మిగిలిన ఇద్దరూ పేజీలో అంతా వెతికి కనుక్కోవటం- అదొక ఆటలాగా తయారైంది పిల్లలకి.




'చదువు అనేది అసలు ఇంత సులభం అని గానీ, ఇంత ఆనందం కలిగిస్తుంది' అని గానీ అనుకోలేదు దావీదు. స్వతహాగా వాడు చాలా తెలివైన వాడు. ఒకసారి చదువు రుచి తెలిసాక, ఇక వాడు దూసుకు పోయాడు. అక్షరాలు చదవటం, పదాలు చదవటంలోంచి, వాక్యాలు చదవటంలోకీ, వాక్యాలు అర్థం చేసుకునేందుకు

ప్రయత్నించటంలోకి వచ్చేసాడు. ప్రతిరోజూ మధ్యాహ్నం పూటంతా వీరబాబు దగ్గర సైకిల్ షాపులో కూర్చుంటున్నాడు. వాడిలో మంచి మార్పు కనిపించటం మొదలెట్టింది వీరబాబుక్కూడా...

ఆరోజు వార్తాపత్రిక మొదటిపేజీలో 'డ్రగ్స్ వినియోగంతో చెడు దారి పడుతున్న యువత' అంటూ ఒక వార్త కనిపించింది వీళ్లకి.

'డ్రగ్స్ అంటే ఏమిటి తాతయ్యా? అవి ఎందుకు చెడ్డవి?' అంటూ ప్రశ్నలు అడిగేసేరు దావీదు, బిట్టు.

"కొన్ని రకాల కెమికల్స్‌కు మత్తు ఎక్కించే లక్షణం ఉంటుంది. వాటిని ఎవరైనా వాడారనుకో, ఆ తర్వాత వాళ్ళకి ఇంక ఎప్పుడూ 'అవే కావాలి, మళ్ళీ కావాలి' అని అనిపిస్తుంటుంది. అవి చాలా ఖరీదువి కూడా. అందుకని చూస్తూండగానే వాళ్ల దగ్గరున్న డబ్బులు అన్నీ ఖర్చయిపోతాయి. అంతే కాక అవి వాళ్ల నెర్వస్ సిస్టంని నాశనం చేసేస్తాయి. దాంతో ఇంక వాళ్ళకు ఏ పని చేసేందుకూ శక్తి లేకుండా పోతుంది. అందుకనే ప్రభుత్వం వాటిని ఎవ్వరూ వాడకూడదు అని రూల్స్ పెట్టింది" చెప్పాడు తాతయ్య.



"సారాయి కూడా అంతే కదండి" అన్నాడు దావీదు, అకస్మాత్తుగా కళ్లనీళ్ళు పెట్టుకొని. వాడికిప్పుడిప్పుడే తమ కుటుంబ పరిస్థితి అర్థం అవుతోంది. వాళ్ల నాన్న రోజూ తాగి వచ్చి, వాళ్ల అమ్మని కొడతాడు; వాళ్ల అమ్మ సంపాదించిన డబ్బుల్ని కూడా ఎత్తుకుపోతాడు; ఇంకా కావాలంటాడు- ఇవన్నీ ఒక్కసారిగా జ్ఞాపకం వచ్చి వాడు

దిగులుగా అయిపోయాడు.

తాతయ్య తల ఊపాడు. "సారాయిని ఊరి బయట దుకాణాల్లో అమ్ముతారు, కానీ డ్రగ్స్ ఇంకా ప్రమాదం. వాటిని ఎవ్వరూ అట్లా కూడా అమ్మేందుకు లేదు, కొనేందుకు లేదు.

'మా నాన్న రోజూ తాగి ఇంటికి వచ్చి మా అమ్మని కొడతాడు తాతగారూ' అన్నాడు దావీదు.



'నువ్వు బాగా చదువుకోవాలి దావీదూ! అప్పుడు నువ్వు చెప్పిన మాటకి విలువ ఉంటుంది. మీ నాన్న చెడు అలవాటుని మాన్పించచ్చు. సరేనా, దిగులు పెట్టుకోకు!' అంటూ బుజ్జగించారు తాతయ్య.

'బీడీ కూడా మంచిది కాదా తాతగారూ?' అని అడిగాడు దావీదు, బీడీలు కాల్చే తాత వీరబాబుని గురించి ఆలోచిస్తూ.

'మంచిది కాదురా దావీదు, అలాంటి అలవాట్లు ఊపిరి తిత్తుల వ్యాధులకీ, కాన్సర్‌కీ దారితీస్తాయి' చెప్పాడు తాతయ్య.

"బీడీలు కూడా మంచివి కావట. తాతచేత బీడీలు మాన్పించాలి" మనసులోనే నిశ్చయం చేసుకున్నాడు దావీదు.

***

రోజూ సాయంత్రం చదువులయ్యాక, పిల్లలకి ఏదో ఒక ఫలహారం పెడుతుంది అమ్మమ్మ. పెరట్లో జామచెట్టు నీడన కూర్చుని, అందరూ కబుర్లు చెప్పుకుంటూ తినాలంటే బిట్టుకి, చిట్టికి, దావీదుకి బలే సరదాగా ఉంటుంది. వీళ్లందరి మధ్యా రెయిన్బో కుక్క గాడు బుద్ధిగా కూర్చుని తను కూడా

ఫలహారాన్ని రుచి చూస్తూ ఉంటాడు. అలాటి సన్నివేశం తమ కుటుంబంలో ఎప్పటికైనా చూస్తానా అని ఆలోచన వచ్చినప్పుడలా దావీదుకు మనసులో చాలా కష్టం అనిపిస్తుంది. అప్పుడే వాడు నిశ్చయించుకున్నాడు: "మా చెల్లెల్ని, తమ్ముళ్లని నేనే పైకి తీసుకు రావాలి' అని.




బిట్టుకి తనకుగా తాతమ్మతో సమస్య లేదు- పైగా తనను బోలెడు ముద్దు కూడా చేస్తుంది. కానీ రెయిన్బో గాడిని చూస్తే గొడవ చేస్తుంది. వాడిని తన గదిలోకి అస్సలు రానివ్వదు. 'రెయిన్బోకి స్నానం చేయించాను తాతమ్మా' అని చెప్పినా ఊరుకోదు. 'ఒరేయ్, నువ్వు ఆ కుక్కపిల్లని వేసుకు తిరిగేవంటే మీ అమ్మకి ఫోన్ చేసి చెప్పేస్తా, నిన్ను తీసుకెళ్లి పొమ్మని' అంటూ బెదిరిస్తుంది కూడా. "'ప్రాణులందరినీ ప్రేమించాలి' అని తాతయ్య, అమ్మమ్మ చెబుతుంటే, ఈ తాతమ్మ ఏంటి, అందరికంటే అంత పెద్దదై ఉండి కూడా రెయిన్బోని విసుక్కుంటోంది?" అని బిట్టుకి కోపం.

ఆఖరికి తాతయ్యని అడిగేసేడు: "తాతయ్యా, తాతమ్మ ఎప్పుడూ రెయిన్బోని విసుక్కుంటుంది. వాడిని అసలు ప్రేమించదు- ఎందుకు?'" అని. వాడి ముఖంలో సీరియస్‌నెస్ చూసి తాతయ్య నవ్వేసాడు. "తాతమ్మకి ఇష్టమేరా! కానీ తన బట్టలు, పక్క తొక్కుతాడని భయం. రెయిన్బో ఇంట్లోనూ, పెరట్లోనూ తిరుగుతూ ఒళ్లంతా మట్టి చేసుకుంటాడు కదా, మనమైతే మట్టి అంటుకుంటే వెంటనే కడిగేసుకుంటాం. కానీ తాతమ్మ గబుక్కున

లేవలేదు. ఆవిడకి ఎవరైనా సాయం చేస్తే కానీ ఏ పనీ చేసుకునే ఓపిక ఉండదు. అందుకే తన గురించి ఎవరినీ ఇబ్బంది పెట్టకూడదని, జాగ్రత్తగా ఉంటుందిరా బిట్టూ! ఎప్పుడైనా మనం ఎదుటివారిని అర్థం చేసుకోవాలి కానీ తప్పుగా అనుకోకూడదు, తెల్సిందా?" అది విన్న తర్వాత బిట్టూకి తాతమ్మ అంటే మరింత ఇష్టం కలిగింది.

అప్పటినుంచీ వాడు తాతమ్మని మరింత జాగ్రత్తగా చూసుకోవటం కూడా మొదలెట్టాడు. రోజూ ప్రొద్దున్నే తాతమ్మకి రాగి జావ తీసుకెళ్లటం, ఆవిడ జావ త్రాగేసాక ఖాళీ కప్పుని తీసుకెళ్ళి వంటింట్లో పెట్టటం, రాత్రి పడుకోబోయే ముందు తాతమ్మకి దుప్పటి కప్పి, చిన్న లైటు వేయటం, 'నిద్ర వస్తోందా' అని అడిగి తెలుసుకుని, 'రావట్లేదు' అంటే కాస్సేపు దగ్గర కూర్చొని కబుర్లు చెప్పటం.. "నేను ఇక్కడే ఉంటే బావుండు కదా, తాతమ్మకి సాయంగా?!" అని కూడా కొద్ది కొద్దిగా ఆలోచించటం మొదలెట్టాడు.

***

ఆరోజు ప్రొద్దున అకస్మాత్తుగా వాన పడింది. తర్వాత ఇక రోజంతా మబ్బు మబ్బుగానే ఉంది. మధ్యాహ్నం అవుతుండగా మళ్ళీ ఓ చిన్న వాన మొదలైంది. వాననీటిలో తడుస్తున్న మొక్కల్ని చూస్తూ వరండాలో కూర్చున్న బిట్టూ,



మెల్లగా లేచి వరండా అంచుకు వెళ్ళాడు. వాన నీటి తుంపరలు మీద పడుతుంటే

కిలకిలా నవ్వుతూనే "హాచ్..చ్చ్" మని రెండు తుమ్ములు తుమ్మేసాడు. అమ్మమ్మ గబుక్కున లోపల్నించి వచ్చి, వాడి రెక్క పుచ్చుకుని లోపలికి తీసుకొచ్చింది:

"వానలో తడిస్తే జలుబు చేస్తుందిరా, బిట్టూ! తడవకు. కావాలంటే కాగితం పడవలు చేసుకుందాం- నువ్వూ నేర్చుకున్నట్లు ఉంటుంది. పారే నీళ్లలో పడవలు వదలచ్చు- సరదాగా ఉంటుంది. ఉండు, కాగితాలు తెస్తాను!' అంటూ అమ్మమ్మ లోపలికి వెళ్ళింది. 'ఈ పడవలు ఏమిటి?' అని చూస్తున్నాడు బిట్టు. అంతలో అమ్మమ్మ కాగితాలు తెచ్చి పడవలు ఎట్లా చెయ్యాలో నేర్పింది. వాన సన్నగా కురుస్తున్నప్పుడు నీళ్లు కాలువ కట్టిన చోట పడవలు వదిలి పెట్టి చూపించింది బిట్టూకి. పడవలన్నీ ఒకదానినొకటి ఒరుసుకుంటూ వంగిపోతూ, ఊగుతూ పోతుంటే బిట్టు సంతోషంతో గెంతులు వేసాడు.

అకస్మాత్తుగా బిట్టు గట్టిగా శ్వాసను ఎగబీల్చి అన్నాడు: ‘అమ్మమ్మా, ఏదో వాసన వస్తోంది. ఏం వండుతున్నావ్, నాకోసం?!’

‘స్టవ్ మీద ఏమీ లేదురా, నీకు ఏం వాసన వస్తోంది?!‘ అని వాడిని అడిగిన క్షణంలో ఆ వాసనని పసిగట్టింది అమ్మమ్మ. ‘ఇది మట్టి వాసనరా!’ అంది. బిట్టు అర్థం కానట్టు చూసాడు. 'మట్టి వాసన?!"

అమ్మమ్మ వివరంగా చెప్పింది- "చాలా రోజుల తర్వాత కొత్తగా వాన పడినప్పుడు, మట్టి తడుస్తుంది కదా, అప్పుడు ఇట్లా ఒకలాంటి కమ్మని వాసన వస్తుందిరా! దీన్ని మట్టి వాసన అంటారు. సిటీల్లో చాలా ప్రాంతాల్లో మట్టికి ఈ వాసన ఉండదు మరి ఎందుకో" అని.

బిట్టు ఒక్కసారి గట్టిగా ఊపిరి పీల్చి వదిలాడు. ‘అబ్బ, ఎంత బాపుందో!’ అనుకున్నాడు. వెంటనే వాన మీద ఒక కవిత రాసేసాడు కూడా :

టప్ టప్ మంటూ వాన
అల్లరి చేస్తూ వాన
మట్టిని తడిపే వాన
కమ్మని వాసన వాన

ఎండని తరిమిన వాన
ఎంచక్కా వాన!
ఏడురంగుల ఇంద్రధనస్సుని తెచ్చేవాన!

రెయిన్బో ప్రసక్తి వచ్చి బిట్టు ముఖం మీద నవ్వులు పూసాయి.

మధ్యాహ్నం వానతో వాతావరణం చల్లబడింది. వేసవి వాన అందరికీ గొప్ప సంతోషాన్నిచ్చింది. సాయంకాలం చదువులు పూర్తి అయ్యే సరికి మళ్ళీ సన్నగా వాన మొదలైంది. "దావీదూ, చిట్టీ, మీరిద్దరూ ఇవాళ్ల ఇంటికి వెళ్లకండి- ఇక్కడే పడుకోండి సరదాగా " అన్నది అమ్మమ్మ. వాళ్లని తీసుకెళ్ళేందుకు గొడుగు వేసుకొచ్చిన వీరబాబుతోటీ ఆ మాటే అన్నది. 'ఎందుకులేమ్మా, తమకు శ్రమ' అన్న వీరబాబు మాటల్ని తాతయ్య కొట్టి పారేసాడు: 'మంచి పిల్లలు...శ్రమ ఏముంది వీరా!' అంటూ.

దాంతో అందరూ భోజనాలు చేసేసి పెందరాడే పక్కల మీదకి చేరారు. వరండాలో గ్రిల్ తలుపు ఉంటుంది. దానికి తాళం వేసేసి, పోయి రెయిన్బోని చూసొచ్చారు అందరూ. వాడు పాలన్నం తినేసి, చక్కగా దుప్పట్లో ముడుచుకొని పడుకున్నాడు అప్పటికే .

మట్టి వాసన కమ్మదనం నిద్రలోనూ తెలుస్తోంది బిట్టూకి- "ఢిల్లీలో ఎప్పుడూ ఇలాంటి వాసన రాదు: అసలు వానే రాదుగా?!" అనుకున్నాడు నిరాశగా. "అమ్మకి చెప్పాలి.. వాన, మట్టి కలిసిన వాసన గురించి" అనుకున్నాడు నిద్రపోతూనే.

**రైటు తర్వాత వచ్చేది లెఫ్టే!**

టీచర్: రామూ! విమానాన్ని ఎవరు కనుక్కున్నారు?
రాము : రైట్ బ్రదర్స్ టీచర్!
టీచర్: కరెక్ట్! సోమూ, నువ్వు చెప్పు, రైలును ఎవరు కనుక్కున్నారు?
సోము: లెఫ్ట్ బ్రదర్స్ టీచర్!



పళ్ళు లేని కుక్క కరిస్తే?
సూదిలేని సిరంజ్ తో
ఇంజక్షన్ చేయించుకోవాలి




# చెప్పుడు మాటలు వినకు

*రచన:గంగమ్మ, 9 వ తరగతి,జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, కోగిర*

కోగిర అడవిలో ఒక మర్రి చెట్టు ఉండేది. ఆ చెట్టు కొమ్మల్లో గూడు కట్టుకొని కాకి ఒకటి నివసిస్తూ ఉండేది. అదే చెట్టు తొర్రలో ఒక పిల్లి, చెట్టు క్రింద కన్నంలో ఒక ఎలుక నివసించేవి.

మూడూ దాదాపుగా సమాన వయస్సువి అవ్వటంతో వాటి మధ్య స్నేహం ఏర్పడింది. జాతులేవీ వాటి స్నేహానికి అడ్డు రాలేదు. అట్లా కొన్నేళ్ళు గడిచాక, "మనం ముగ్గురం స్నేహితులం కదా, ఆ సంగతి లోకానికి అంతటికీ తెలిసేట్లు చేయటం ఎలాగ?" అని అవి చాలా సీరియస్‌గా ఆలోచించాయి.

ఆలోచించి, "ఇకనుండీ రోజూ ముగ్గురం కలిసి వంట చేసుకుని తిందాం" అని నిశ్చయించుకున్నాయి.

"కలిసి పని చేస్తూంటే మనం పదిమంది కళ్ళలో పడతాం. అట్లా మన గురించీ, మన

స్నేహం గురించీ అందరికీ తెలుస్తుంది" అన్నది పిల్లి.

"అవును- నిజమే. కలిసి వంట చేసుకుందాం" అన్నది ఎలుక.

"మరి ఎవరు ఏం పని చెయ్యాలి?" అడిగింది కాకి.



"ఎవరికి సులభంగా వచ్చిన పని వాళ్ళు చేద్దాం. నువ్వు పుల్లలు ఏరుకురా. ఎలుక గింజలు తెస్తుంది. నేను వంట చేస్తాను" అన్నది పిల్లి.

"సరే!" అన్నాయి మిగిలిన రెండూ.

అట్లా వాటి వంట కార్యక్రమం మొదలైంది. అడవిలోని జంతువులన్నీ వాటి గురించి చాలా గొప్పగా చెప్పుకున్నాయి. అవి కూడా చక్కగా వండుకొని హాయిగా తింటూ, చీకూ చింతా లేకుండా జీవించినై, కొన్నాళ్ళు.

అట్లా నెల రోజులు గడిచిందో, లేదో- ఒక నక్క చూపు పడింది వీటి మీద. వీటికి మంచి పేరు రావటం దానికి ఇష్టం లేదు. "వీటి స్నేహాన్ని చెడగొట్టాలి, పిల్లిని చంపి తినెయ్యాలి" అనుకుందది.

"ఈ మూడింటిలోనూ కొంచెం అమాయ-కంగా ఎవరు ఉంటారు, పొగిడితే ఎవరు పొంగి పోతారు?" అని ఆలోచించింది.

కాకి-రొట్టె ముక్క కథ గుర్తుకొచ్చింది దానికి.

అది కాకి దగ్గరకు వెళ్ళి: "కాకి బావా! ఎంతైనా నువ్వు నువ్వే! మీ ముగ్గురిలోనూ చాలా కష్టపడేదంటే నువ్వే. వాళ్ళ పని ఏమున్నది? కడుపులో చల్ల కదలకుండా సుఖంగా ఉంటారు" అన్నది.

"అదేం లేదులే, ముగ్గురమూ బాగానే పని చేస్తాం. ఎవరికి వీలైనంత పని వాళ్లం చేస్తాం"

అన్నది కాకి.

నక్క దాన్ని వదల్లేదు. బ్రాహ్మణుడు-దొంగలు కథ గుర్తు చేసుకున్నది. మళ్ళీ మళ్ళీ కాకిని పలకరించటం, మళ్ళీ మళ్ళీ అదే మాట అనటం చేసింది.



ఇట్లా కొన్ని సార్లు అనేసరికి కాకిలో ఆలోచన మొదలైంది.." నిజంగానే ఈ పిల్లి, కాకి పెద్ద పని చేయట్లేదు" అనిపించింది దానికి.

దాని ఆలోచనని పసిగట్టిన నక్క "నిజం కాకమ్మా! కావాలంటే ఓ పని చెయ్యి. పిల్లి చేసే పని నువ్వు చేసి చూడు- నీకే అర్థమైపోతుంది, అది ఎంత చవకైన పనో!" అని హితబోధ చేసింది.

దాని బుట్టలో పడిపోయిన కాకి వెంటనే మిత్రుల దగ్గరికి పోయి తగవులాడింది- "నేను చాలా అలసిపోతున్నాను. పని బరువు బాగా పడుతున్నది. మీరు సులభం పనులు పెట్టుకొని, నాకు ఇంత కష్టం పని పెట్టారు. అది కుదరదు. ఇప్పుడు పనులు మార్చుకోవాల్సిందే!" అని పట్టుబట్టింది.

పిల్లికి, ఎలుకకి కోపం వచ్చింది. "నా కష్టం నీకు తెలీదు. నువ్వు వంట చెయ్యి తెలుస్తుంది!" అన్నది పిల్లి. "నా పని నాకూ నచ్చట్లేదు. ఎంత ఏరినా గింజలు దొరకట్లేదు- ఆ పని నువ్వు చెయ్యి!" అన్నది ఎలుక.

మూడూ పనులు మార్చుకున్నాయి.

గింజల కోసం వెళ్ళిన పిల్లి నక్క నోట చిక్కింది.

వంట చేసేందుకు వెళ్ళిన కాకి కాస్తా పొయ్యిలో పడి కాలిపోయింది.

పుల్లల కోసం పోయిన ఎలుక మరి ఏమైందో, ఇంకా తిరిగే రాలేదు.

చూసారా! చెప్పుడు మాటలు ఎంత చేటు చేస్తాయో?!




# గారెలు తిన్న గాడిద

*ఒక్కోసారి సమాజం అబద్ధాలని ఇష్టపడినంతగా నిజాలను ఇష్టపడదు. ఇదిగో, ఈ కథలోలాగా అన్నమాట! రచన: నవ్య కృష్ణ, నాలుగో తరగతి, వికాస విద్యావనం, పోరంకి, కృష్ణాజిల్లా.*
*మార్పు చేర్పులు: కొత్తపల్లి.*

మల్లేశు, సీతాలు చాకలి పని చేసేవాళ్ళు. వాళ్లకు ఒక గాడిద ఉండేది. దాని పేరు గుడ్డూ. బట్టలు రేవుకు మోసేందుకు, బియ్యం సరుకులు తెచ్చేందుకు, పక్క ఊళ్ళో ఉన్న కూతురింటికి వెళ్ళేందుకు అన్నిటికీ ఆ గాడిదమీదే తిరిగేవాడు మల్లేశు.

ఓ రోజు కూతురింటికి ప్రయాణం కట్టాడు మల్లేశు. ఏవేవో పచ్చళ్ళు, పెరట్లో కాసిన కూరగాయలు సంచుల నిండా నింపాడు. "ఏమయ్యా! వేడిగా కాసిని గారెలు చేసి కూతురికి తీసుకు వెళ్దామా?" అంది సీతాలు.

"అవునవును. అల్లుడికి గారెలంటే చాలా

ఇష్టం. చకచకా చేసిపెట్టు. తీసుకొని బయలుదేరుదాం" అన్నాడు మల్లేశు.



సీతాలు వంటింట్లోకి వెళ్ళి సరిగ్గా పదంటే పది గారెలు చేసింది.

కమ్మటి ఆ గారెల వాసనకు చుట్టు ప్రక్కల ఇళ్ళలో వాళ్లందరి నోళ్ళూ ఊరాయి.

పొరుగింటి రత్నమ్మ, సుబ్బరత్న కొంచెం సేపు ఆగారు గానీ, ఇక తట్టుకోలేక గబగబా వచ్చేసారు- "ఏం చేస్తున్నావు వదినా, ఇంత ఘుమఘుమలు!" అంటూ.

"అల్లుడికి గారెలంటే ఇష్టం కదా వొదినా, అందుకని ఇప్పుడు ఇవి పెట్టుకున్నాం. ఇదిగో తిని చూసి చెప్పండి అని వాళ్ళిద్దరికీ తలా ఒక గారె ఇచ్చింది సీతాలు.

వాళ్ళు తింటుంటే చూస్తూ ఉండలేకపోయాడు మల్లేశు. "సీతాలూ! నేను వీటిని మూట కట్టేయనా? బయలుదేరచ్చు ఇంక?" అంటూనే వాటి దగ్గరికి వెళ్ళి చకచకా రెండు గారెలు తినేసాడు. "బాగా వచ్చినై. రుచి బలే ఉంది" అంటూ.

"అయిపోతున్నాయి.. తినకు! అయిపోతున్నాయి.. తినకు" అని సీతాలు గుండె అరిచింది, కానీ రత్నమ్మ, సుబ్బరత్న ఉండగా ఆ మాటని బయటికి అనలేదు కదా! అందుకని "అవునవును బాగా వచ్చాయి. ఇంకో రెండు తినయ్యా!" అనేసింది పళ్ళు నూరుతూ.

'సీతాలు అన్నది కదా' అని మల్లేశు ఇంకో గారె లాగించాడు.

పొరుగిళ్ళవాళ్ళు వెళ్ళగానే సీతాలు మల్లేశుతో వాదనకు దిగింది-"తినమంటే అట్లా

తినెయ్యటమేనా?! చూసుకోవద్దా?! నేను మనిషిని కాదా?!" అని. దాంతో మల్లేషు సీతాలుని బుజ్జగించి, ఆమెకు రెండు గారెలు తినబెట్టాడు- తను ఇంకో గారెను లాగిస్తూ.



అంతసేపటి నుండీ గారెల వాసనని పీలుస్తున్న గాడిద ఇంక తట్టుకోలేక పోయింది. నేరుగా ఇంట్లోకి వచ్చేసి, మిగిలిన రెండు గారెల్నీ లటుక్కున తినేసి, చక్కా పోబోయింది.

సీతాలు లబోదిబోమన్నది. "గారెలు తినేసి పోతోంది చూడయ్యో!" అంటూ.

దాంతో మల్లేశు కట్టె పట్టుకొని గాడిద వెంట పడ్డాడు: "బిడ్డకోసం అన్నన్ని గారెలు చేస్తే తినేసేందుకు నీకు నోరెలా వచ్చిందే!" అని అరుస్తూ. అతని వెనకనే సీతాలు!

గాడిదకి తల తిరిగింది: "నేను తిన్నది రెండే కదా, అట్లా అంటారేంటి?!" అని. అయినా తనని తాను కాపాడుకోవాలి కాబట్టి, అది చటుక్కున వెను తిరిగి, రోడ్లోకి పరుగు పెట్టింది.

కొద్ది దూరం దాని వెంట పడిన మల్లేశు, సీతాలు అలిసిపోయి, ఒట్టి చేతులతో వెనక్కి తిరిగి వచ్చారు.

అప్పటికి ఊరి పొలిమేర చేరుకున్న గాడిద కొంచెం సేపు చాలా ఆలోచించింది: "రెండు గారెలు తింటే కూడా తట్టుకోలేని యజమాని వృధా" అనిపించింది దానికి. అందుకని అది ఆ ప్రాంతాల్లో దొరికిన గడ్డినే మేసేసి, అక్కడే పడుకొని నిద్రపోయేందుకు చూసింది. అయితే ఎంత సేపటికీ దానికి నిద్ర రాలేదు. ఒకవైపునుండి మల్లేశు కట్టె పట్టుకొని వస్తున్నట్లు, మరో వైపునుండి పాములు, తేళ్ళు ప్రాకినట్లు, మరో వైపునుండి పులులు, తోడేళ్ళు వచ్చి మీద పడినట్లు అనిపించి వణుకుతో జ్వరం

వచ్చేసింది దానికి. సాయంత్రం అయ్యేసరికి అది లేచి వెనక్కి బయలుదేరింది: "మళ్ళీ ఇంటికే పోతాను. పని లేకపోతే నిద్ర కూడా రాదు" అనుకుంటూ.




సరిగ్గా ఆ సమయానికే దాన్ని వెతుక్కుంటూ వచ్చాడు మల్లేశు. ఇప్పుడు అతని చేతిలో కట్టె లేదు. "పోనీలే! గారెలు తింటే తినేసావు. ఏం చేస్తాం. ఈసారినుండీ తినకు!" అంటూ దానిమీద బరువులు వేసి, కులాసాగా బిడ్డ ఊరికి తీసుకెళ్ళాడు. "మీకోసం గారెలు కూడా చేసిందమ్మా, మీ అమ్మ! కానీ ఇదిగో, ఈ గాడిదే- ఇది తినేసింది ఒక్కటీ మిగల్చకుండా!" అని మల్లేశు బిడ్డకి చెబుతుంటే గాడిదకు తల తీసేసినట్లయింది. అయినా సర్దుకుని అట్లాగే నవ్వుముఖంతో నిలబడింది అక్కడంతా.

తెల్లవారగానే మల్లేశం దాన్ని ఇంటికి తెచ్చి, ఎప్పుడూ కట్టే చోట కట్టేస్తే "అబ్బ! ఇల్లు చేరుకున్నాను!" అనుకొని తృప్తిగా నిద్రపోయింది గాడిద.

అయినా ఆ తర్వాత సంవత్సరం వరకూ అందరూ దాన్ని తిడుతూనే ఉన్నారు: "వదిలేస్తే ఇది ఎన్ని గారెలైనా తినేస్తుందమ్మా" అని!

**పొడుపు కథలు**

1. బంగారు చెంబులో వెండి గచ్చకాయ? పనసతొన
2. అమ్మ తమ్ముడిని కాను, కానీ నేను మీకు మేనమామను! చందమామ
3. ఆకులేని ఆడవిలో జీవంలేని జంతువు జీవమున్న జంతువులను వేటాతుంది! దువ్వెన
4. ఇల్లుకాని ఇల్లు! బొమ్మరిల్లు




# కుందేలు బెరుకు

*రచన : వినోద్, 6 వ తరగతి, కల్లం అంజిరెడ్డి విద్యాలయ, హైదరాబాదు*

*సౌజన్యం : కథా పాఠశాల, రవి శంకర్ వుండి.*



అనగనగా ఓ రైతు దగ్గర ఒక ఆవు, ఒక గుర్రం ఉండేవి. రోజూ అవి రెండూ ఊరవతల ఉన్న అడవికి వెళ్ళి మేసి వచ్చేవి.

ఆవు, గుర్రం అడవికి వెళ్తుంటే ఒక కుక్క కూడా వాటితో పాటు అడవికి పోయేది. అట్లా రోజూ కలిసి వెళ్తూ, వస్తూ అవి మంచి స్నేహితులయ్యాయి. ముచ్చట్లు చెప్పుకొనీ చెప్పుకొనీ వాటి స్నేహం బాగా గట్టి పడింది.

అడవిలో ఉండే ఒక కుందేలుకు ఈ ముగ్గురు స్నేహితులను చూస్తే చాలా ముచ్చటగా ఉండేది. "నాకు కూడా ఇట్లాంటి ఫ్రెండ్స్ ఉంటే ఎంత బాగుండేది!" అనుకునేదది. కానీ వాటి దగ్గరికి వెళ్ళి "నాతో స్నేహం చేస్తారా?" అని అడగాలంటే, మరి దానికి సిగ్గు, బెరుకు!!



ఒకసారి కుందేలు పొదల మాటున కూర్చొని ముగ్గురు స్నేహితుల్నీ చూస్తూ మైమరచి పోయింది. తెలివి వచ్చి చూసుకునేసరికి ఏమున్నది, నక్క ఒకటి తనను వాసన చూస్తున్నది!

భయంతో వణికిపోయిన కుందేలు ఒక్క గెంతు గెంతి, పరుగు పెట్టింది. అంతలోకే గుర్రం సకిలించింది. ఆవు బుస్సుమన్నది. కుక్క గుర్రుమన్నది. నక్క వాటిని చూడగానే ఆగిపోయి, తోకముడిచింది. కుక్క, ఆవు, గుర్రం ముందుకు దూకటం, నక్క పారిపోవటం ఒకేసారి జరిగిపోయాయి.



ముగ్గురు స్నేహితులకూ కృతజ్ఞతలు చెప్పేసింది కుందేలు: "మిమ్మల్ని ఎన్నో రోజుల నుండీ చూస్తున్నాను. మీతో స్నేహం చేయాలని చాలా ఉత్సాహ పడ్డాను, కానీ బెరుకు వల్ల మీ ముందుకు రాలేదు ఇన్నాళ్ళూ" అన్నది.

ముగ్గురు స్నేహితులూ ఒకదానికేసి ఒకటి చూసుకొని "స్నేహం చేయాలనుకున్నప్పుడు బెరుకు పనికిరాదు. ఇన్ని రోజులూ నువ్వు మాకు కనబడలేదు గానీ, లేకపోతే మేమే నీతో స్నేహం చేసేవాళ్లం. ఈ నక్క ఏదో మనకు మేలే చేసింది. ఇవాల్టినుండి మనం నలుగురం స్నేహితులం!" అన్నాయి.




# ఓక్ చెట్ల కథ

*సేకరణ: చరణ్ తేజ, 4 వ తరగతి, క్రాస్‌వర్డ్ స్కూల్, గుంటూరు.*

అనగనగా అమెరికాలో ఎప్పుడూ పచ్చగా ఉండే అడవి ఒకటి ఉండేది. ఆ అడవిలో చాలా ఓక్ చెట్లు ఉండేవి. సూర్యుడి ఎండ ఆ అడవిలో ఎక్కడా ఒక్క సూది మోపినంత కూడా పడేది కాదు: ఆ ఓక్ చెట్లు అంత దట్టంగా ఉండేవి. అడవి మొత్తం ఓక్ చెట్లతోటే నిండిపోయి ఉండేది.

అది కనుక్కున్నారు కొందరు మనుషులు. వాళ్లంతా రోజూ ఆ అడవిలోకి రావటం మొదలు పెట్టారు. చెక్క పని చేసే వడ్రంగులు వచ్చి చెట్లను నరికి కొట్టుకొని వెళ్ళేవాళ్ళు; వాటితో మంచి మంచి బొమ్మలు తయారు చేసేవాళ్ళు. రైతులు వచ్చి ఓక్ చెట్ల కొమ్మలను, ఒక్కోసారి పూర్తి మానుల్ని కూడా, నరికి తీసుకెళ్ళేవాళ్ళు; వాటితో తమకు కావలసిన వ్యవసాయ పనిముట్లు

తయారు చేసుకునేవాళ్ళు.

కొద్ది రోజుల వరకూ ఓక్‌చెట్లకు ఇది బాగానే అనిపించింది. రాను రాను వాటికి భయం వేయటం మొదలైంది: "వీళ్ళు మనల్ని పూర్తిగా ఐపోగొడితే?" అని.




ఆ ఆలోచన వచ్చేసరికి ఓక్ చెట్లు చాలా గందరగోళ పడ్డాయి. తమ జాతి మొత్తం అంతరించిపోతుందని వాటికి భయం వేసింది.

చివరికి అన్నీ కలిసి దేవుడిని ప్రార్థించటం మొదలు పెట్టాయి. "దేవుడా! ఈ మనుషులు ఎవ్వరూ మమ్మల్ని కొట్టకుండా చూడు!" అని.

వాటి ప్రార్థన విన్న దేవుడు ఒకరోజున నీటి మేఘం రూపంలో ప్రత్యక్షమైనాడు: "చూడండి, ప్రకృతిలో ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అని లేదు, మీరు వృథాగా భయపడుతున్నారు!" అన్నాడు.

"కాదు కాదు- "నిజంగానే మేం అంతరించి పోతాం! మమ్మల్ని మనుషులెవ్వరూ కొట్టేయకుండా చెయ్యి" అన్నాయి ఓక్ చెట్లు.

"సరే, అట్లాగే కానివ్వండి మరి, మీ ఇష్టం" అంటూ దేవుడు మాయం అయిపోయాడు.

తర్వాతి రోజుకల్లా ఓక్ చెట్లన్నిటికీ ఏదో వ్యాధి సంక్రమించింది. ఓక్ చెట్టుతో చేసిన ప్రతి వస్తువూ పాడవ్వసాగింది. ఇప్పుడు ఆ చెక్క బొమ్మలకి పనికి రావట్లేదు; పనిముట్లకీ పనికి రావట్లేదు. చివరికి పొయ్యిలో పెట్టుకునేందుకు కూడా!

మనుషులు "ఓక్ చెట్టు" అనగానే "అబ్బ వద్దు!" అనటం మొదలు పెట్టారు. మొదట్లో ఓక్ చెట్లకు ఇది చాలా సంతోషం

అనిపించింది. కానీ రాను రాను అవి ఒంటరివి అయిపోయాయి.

మనుషులెవ్వరూ ఇప్పుడు అడవిలోకే రావట్లేదు. వాటిని పట్టించుకోవట్లేదు. చివరికి ఎండి, పడిపోయిన చెట్లమొద్దుల్ని కూడా ఎవ్వరూ ఎత్తుకెళ్ళట్లేదు.



ఇట్లా కొంత కాలం గడవగానే అవి మళ్ళీ దేవుడిని తలుచుకోవటం మొదలు పెట్టాయి: "దేవుడా! మాకు ఈ ఒంటరి తనం వద్దు. ఇదివరకులాగే ఉండనివ్వు చాలు! తప్పయిపోయింది" అంటూ.

దేవుడు మళ్ళీ వచ్చాడు- "నేను చెప్పలేదా, ఇట్లా మీరు ఉండలేరని?!" అంటూ.

"నిజమే స్వామీ! మాకు ఇలాంటి జీవితం వద్దు. దీనికంటే అంతరించిపోవటమైనా మేలే!" అన్నాయి ఓక్ చెట్లు.

దేవుడు నవ్వి, "లేదులే! మీ వల్ల ఎంత లాభమో గుర్తించిన మనుషులు ఇంకా ఇంకా ఎక్కువ సంఖ్యలో మిమ్మల్ని పెంచుతారు. మీ వల్ల ఈ పర్యావరణం అంతా బాగౌతుంది. భూమి మొత్తం మీ గురించి గొప్పగా చెప్పుకుంటుంది. బెంగపడకండి" అంటూ ఆశీర్వదించాడు.

ఆ తర్వాత ఓక్ చెట్లు మళ్ళీ ఉపయోగంలోకి వచ్చేసాయి; మనుషులకు అవంటే మళ్ళీ ఇష్టం ఏర్పడ్డది. వాళ్ళు ఎక్కడపడితే అక్కడ ఓక్ చెట్లను పెంచటం మొదలెట్టారు. ●

**చిలిపి ప్రశ్నలు- తిక్క జవాబులు**



సెల్ ఫోన్ పోతే ఏమౌతుంది? — మనశ్శాంతి ఫ్రీగా వస్తుంది.

నిమ్మకాయ సగానికి కోసి రసం ఎందుకు పిండుతారు? — తొక్క తీస్తే టైం వేస్ట్ కాబట్టి




# పట్టుదల

*రచన: కీర్తిరెడ్డి, 9 వ తరగతి, తేజ విద్యాలయ, కొమరబండ*

రాఘవపురంలో నివసించే సూరయ్య కుటుంబాన్ని చాలా జాగ్రత్తగా చూసుకునేవాడు. ఆయనకు ఒకే కూతురు. పేరు మీనాక్షి.

సూరయ్య చిన్న తనంలో చాలా కష్టాలు ఎదుర్కొన్నాడు. ఆ రోజుల్లో తనకు సినిమాల పిచ్చి ఉండేది. ఇంట్లోవాళ్ల అనుమతితోటీ, అనుమతి లేకుండా కూడానూ చాలా సినిమాలు చూసేవాడు. బడిని ఎగగొట్టి సినిమాలు చూడటం, బడిలో హాజరు తగ్గి, అధ్యాపకులు దండించటం, వాళ్ల నాన్న మండిపడటం- ఇవన్నీ సూరయ్య ఆలోచనల మీద బాగా ప్రభావం చూపాయి.

దానితో ఆయన చాలా స్ట్రిక్టుగా తయారయ్యాడు. ఇంట్లో ఎవ్వరూ ఆయన ముందు నోరెత్తటానికి లేదు. ఇంట్లో ఏవి

ఉన్నాయో, ఏవి లేవో చర్చించటానికి లేదు. ఏ పని పడినా ఆయనకు చెప్పే వెళ్ళాలి. సినిమాలు, టివిలు, నవలలు- ఇట్లాంటివి అస్సలు మంచివి కాదు.

అట్లా అని ఆయన మరీ కఠినంగా కూడా ఏమీ ఉండేవాడు కాదు. మీనాక్షి బాగా చదువుకోవాలి, సొంత కాళ్ల మీద నిలబడాలి, ఆమెకి మంచి ఉద్యోగం రావాలి అని బాగా ప్రోత్సహించేవాడు కూడా. మీనాక్షి కూడా, వాళ్ల నాన్న కోరికను తీర్చేందుకు పట్టుదలతో కృషి చేసేది. పాఠశాలలో ప్రతి ఒక్క పనిలోనూ తనే ముందు ఉండేది. ఉపాధ్యాయులు చెప్పే మంచి మాటలని పాటించేది. పెద్దలు చెప్పే విషయాల్ని గుర్తుపెట్టుకొని పరీక్షలలో చక్కగా వివరించి రాసేది.

అయితే ఒక్క విషయంలో మాత్రం ఆ పాప తండ్రి ఇష్టానికి భిన్నంగా ఉండేది. తనకు నాట్యం అంటే చాలా ఇష్టం. వాళ్ల బడి అసెంబ్లీలో ఎప్పుడు ఎవరు నాట్య ప్రదర్శన ఏర్పాటు చేసినా తను అందులో తప్పక పాల్గొనేది. నాట్యపోటీలు అనేకాలలో ఆమె బడి తరపున పాల్గొన్నది; పాల్గొన్న ప్రతిసారీ బడికి మంచి పేరు తెచ్చి పెట్టింది. ఆ సంగతులేవీ ఇంట్లో ప్రస్తావనకు వచ్చేవి కాదు. సూరయ్యకు నాటకాలు, నాట్యాలంటే అస్సలు ఇష్టం లేదు మరి! మీనాక్షి నాట్యం చేస్తుందని ఆయనకు తెలిస్తే ఆ పాపను బడి కూడా మాన్పించేసేవాడేమో!




ఒకరోజున వాళ్ల ఆర్ట్ టీచరుగారు మీనాక్షిని పిలిచి, "అమ్మా మీనాక్షీ! చదువు లాగే, కళలన్నీ కూడా విద్యలోని విభిన్న భాగాలే.

వీటిలో ఒకటి గొప్ప, ఒకటి తక్కువ అని లేవు. అయితే, ఈ రోజుల్లో బ్రతుకు సాఫీగా సాగాలంటే చదువు తప్పని సరి కనుక, తల్లి దండ్రులు చదువు మీద ఎక్కువ దృష్టి పెడుతున్నారు. నీలో మంచి కళాకారిణి కూడా ఉన్నది. నువ్వు చదువుకోసం నీలోని కళను అణచి వేస్తావో, లేక నీ చదువుతో పాటు దానికీ న్యాయం చేస్తావో బాగా ఆలోచించుకో. రెండూ చేయాలంటే మటుకు నువ్వు బాగా శ్రమించాలి. అందరికంటే ఎక్కువ సాధన చేయాలి" అని చెప్పింది.

"ఇష్టంగా నేర్చేవాళ్ళు ఉంటే శ్రమ పడటం ఏమున్నది టీచర్. నేను చదువుకూ న్యాయం చేస్తాను; నాట్యానికీ న్యాయం చేస్తాను" అన్నది మీనాక్షి నిశ్చయంగా.

పదో తరగతిలోనే కాదు, తర్వాత ఇంటర్మీడియట్ లోను, డిగ్రీలో కూడా చదువుల్లో ఫస్టు ఎవరంటే అందరూ మీనాక్షి పేరే చెప్పేవారు. బిడ్డ బాగా చదువుతున్నదని సూరయ్య చాలా సంతోష పడేవాడు. పరీక్షల సమయంలో ఆ పాప వెంట కూర్చొని చదివించేవాడు. విద్యని బాగా నేర్చుకుంటే ఎన్నో విజయాలు సాధిస్తావు తల్లీ" అని చెప్పేవాడు.

ఆ తర్వాత పోటీ పరీక్షలు రాసిన మీనాక్షి మొదటి ప్రయత్నంలోనే బ్యాంకు ఆఫీసరుగా ఉద్యోగం తెచ్చుకున్నది. సూరయ్య చాలా సంతోష పడ్డాడు. ఆయన కలలు నెరవేరినై. "ఇన్నేళ్ళూ నీ గురించి కష్ట పడింది ఇందుకే తల్లీ! నువ్వు నా పేరు నిలబెట్టావు!" అని చాలా మెచ్చుకున్నాడు.

కొద్ది రోజులకే రేడియోలో ఒక ఇంటర్వ్యూ ప్రసారమైంది. "జాతీయ నృత్యనాటక పోటీల్లో ప్రథమ బహుమతి సంపాదించి రాష్ట్రానికే వన్నె తెచ్చిన కుమారి మీనాక్షి ఈమధ్యే ఒక బ్యాంకు ఉద్యోగానికి కూడా ఎంపికైంది. చిన్నప్పటినుండీ నాట్యరంగానికి సేవ చేస్తూ, అనేక విజయాలను, పతకాలను సాధించింది మీనాక్షి. మరి ఇప్పుడు తను ఏం చేయనున్నది? ఉద్యోగమా-కళా జీవితమా?" అంటూ.

అందులో మీనాక్షి చెప్పింది: "ఉద్యోగాన్నీ, కళల్నీ నేను వేరు వేరుగా చూడను. ఇన్నేళ్ళూ చదువులతో పాటు నా ఇష్టమైన నాట్యాన్ని కూడా కొనసాగించగలిగాను. ఇకమీద కూడా అదే చేస్తాను. ఉద్యోగానికీ, కళాజీవితానికీ రెండింటికీ న్యాయం చేసి చూపిస్తాను".




రేడియోలో మాట్లాడుతున్నది తన బిడ్డ మీనాక్షే అని గుర్తించేందుకు చాలా సేపు పట్టింది సూరయ్యకు. అయితే ఒకసారి గుర్తించాక, ఆమె గొంతులోని స్థిరత్వం, ఆ పాప పరిణతి సూరయ్యను పూర్తిగా ఆశ్చర్యంలోకి నెట్టేసాయి. తన బిడ్డలోని ఈ కోణాన్ని తను ఇన్నేళ్ళుగా ఎందుకు, చూడలేకపోయాడు? తన నమ్మకాలనీ, భయాలనీ బిడ్డమీద ఎందుకు, రుద్దాడు? తన ఇంట్లోనే ఇంతటి ప్రజ్ఞాశాలి ఉన్నదని ఎందుకు, గుర్తించలేకపోయాడు? ఆమె ఇష్టాన్ని ఎందుకు కాలరాసాడు?"

ఆ రోజు ఆఫీసునుండి ఇంటికి వచ్చిన మీనాక్షికి కళ్లనీళ్లతో ఎదురైనాడు సూరయ్య "అమ్మా! నీకు నాట్యమంటే ఇంత ఇష్టమని నాకెందుకు చెప్పలేదమ్మా?" అంటూ.

కనీసం "టీవి చూస్తా నాన్నా" అన్నా కూడా మీరు తిట్టేవారు.. 'నేను నాట్యం చేస్తాను' అని మీకు చెప్పలేకపోయాను నాన్నా! అయినా నేను నీ ఆశయాలకు భంగం కలగనివ్వలేదు నాన్నా! చదువులకు ఏ లోపమూ రానివ్వలేదు" అన్నది మీనాక్షి.

"నన్ను క్షమించు తల్లీ! కళల్ని చిన్నచూపు చూసాను. నీలాంటి కళామతల్లి నా యింట పుట్టటం నిజంగా నేను చేసుకున్న పుణ్యం" అంటూ ఆనంద బాష్పాలు రాల్చాడు సూరయ్య.



# రేపో మాపో!

రచన: సుబ్బారావు,అభి, 6 వ తరగతి, వికాస విద్యావనం, పోరంకి, కృష్ణాజిల్లా.

వెంగాపురపు వెంగమ్మ కొడుకు వెంగళప్ప అమాయకుడు. పైగా అతనికి ఎక్కడా లేనంత మతిమరుపు.

ఒక రోజు పొద్దున్నే వెంగమ్మ కొడుకుతో "ఒరే! ఆషాఢమాసం వచ్చేసిందంటే ఇక మంచి రోజులు ఉండవు. అయితే అది కచ్చితంగా ఎప్పుడు వస్తుందో తెలీదు. మంగాపురంలో మన పంతులుగారు ఉంటారు. నువ్వు ఇప్పుడు బయలుదేరి ఆయన దగ్గరికి పోవాలి. ఆషాఢమాసం ఎప్పుడు వస్తుందో కనుక్కొని రావాలి. పోయి రాగలవా, సరిగ్గా?!" అన్నది.

"ఓ! దానిదేముంది, తప్పకుండా పోయొస్తాను వెంటనే! మంగాపురమేగా?" అని అన్నం మూట కట్టుకొని బయలుదేరాడు వెంగళప్ప.

మధ్య దారిలో అన్నం తినేంతవరకూ వాడికి ఆషాఢమాసం గుర్తుందిగానీ, ఆ తర్వాత వాడు ఆ మాటను మర్చిపోయాడు. ఎందుకో మరి, తను మంగాపురం పోవాలి, అక్కడ పంతులు గారిని కలవాలి- ఏదో అడగాలి.. ఏం అడగాలి?"

అట్లా ఆలోచిస్తూ పోయి పోయి వాడు నేరుగా ఓ గుంతలో పడ్డాడు. గుంత లోతుగా ఉందేమో, మరి ఎంత ప్రయత్నించినా అందులోంచి బయటికి రాలేకపోయాడు. "కాపాడండి-కాపాడండి!" అని అరవటం మొదలు పెట్టాడు.

అటుగా పోతున్న బాటసారులు కొందరు వాడిని చూసి జాలిపడ్డారు. తమ అంగవస్త్రాల్ని అన్నిటినీ కలిపి మోకులాగా కట్టి, దాన్ని గుంతలోకి జారవిడిచారు. దాని సాయంతో బైటికి వచ్చాడు వెంగళప్ప. "ధన్యవాదాలు మీకు" అన్నాడు. వాళ్ళు "ఏమీ పరవాలేదు" అన్నారు.

వెంగళప్పకి ఆమాట చాలా నచ్చింది. "ఏమీ పరవాలేదు- ఏమీ పరవాలేదు" అని వల్లె వేసుకుంటూ ముందుకు సాగాడు.

సాయంత్రం అయ్యే సరికి వాడు ఇంకా తర్వాతి పల్లెలోనే ఉన్నాడు. అక్కడ వాడిని గుర్తుపట్టిన ముసలమ్మ ఒకామె "ఒరేయ్ వెంగళప్పా! ఎటురా, పోయేది? ఇవాల్టికి ఇక్కడే ఉండి, రేప్పొద్దున పోదువు" అన్నది

"ఏమీ పరవాలేదు- ఏమీ పరవాలేదు" అన్నాడు వెంగళప్ప.




"పరవా ఎందుకు లేదు! ఉంది. ఇప్పుడు వదిలితే మీ అమ్మ నన్ను ఇంక నమ్మి బ్రతకనిస్తుందా? అసలే కరువు రోజులు!" అన్నది ముసలమ్మ, వాడిని ఇంట్లోకి పిలిచి

అన్నం పెడుతూ.

"కరువు రోజులు- కరువు రోజులు!" అనుకోవటం మొదలెట్టాడు వెంగళప్ప.

తెల్లవారగానే ముసలమ్మ "నాయనా! కరువు రోజులు వచ్చేసాయి! ఏదో కొంచెం చద్దన్నం మాత్రం పెట్టగలను నేను!" అన్నది.

"కరువు రోజులు" అన్నాడు వెంగళప్ప.

"అవున్నాయనా! కరువులో అధికమాసం అంటే ఇదే!" అన్నది ముసలమ్మ బాధగా.

"ఆ! దొరికింది! అధికమాసం! అధికమాసం" అరిచాడు వెంగళప్ప సంతోషంగా.

"ఏంటది?" అన్నది అవ్వ, బిత్తరపోతూ.

"అధికమాసం ఎప్పుడొస్తుందో కనుక్కోవాలి నేను. అదేదో ఊళ్ళో పంతులుగార్ని అడిగి!" అన్నాడు వెంగళప్ప.

"అధికమాసం కాదు, ఆషాఢమాసం అయి ఉంటుంది!" అన్నది అవ్వ కొంచెం అనుమానంగా.

"అదే అదే" అన్నాడు వెంగళప్ప "ఆషాఢ మాసం - ఆషాఢ మాసం" అనుకుంటూ.

అవ్వ వాడికి మంగాపురం దారిని కూడా గుర్తు చేసి, త్వరగా సాగనంపింది.

మెల్లగా పంతులుగారి దగ్గరికి వెళ్ళాడుగానీ, ఆషాఢమాసాన్ని మరచేపోయాడు వెంగళప్ప. వెళ్ళి, ఆయన దగ్గర నిలబడి, "అరవగోల- ఎప్పుడొస్తుంది?" అని అడిగాడాయన్ని.

పంతులు గారికి సంగతి అర్థం కాలేదు. "అరవగోల రావటం ఏమిటీ?!" అని ఆలోచించాడు.



ఆయన ఎంత వెతికినా తన దగ్గరున్న పుస్తకంలో అరవగోల కనిపించలేదు. అందుకని ఆయన ఉపాయం చేసి, "పుస్తకం కనపడలేదు బాబూ! నువ్వంటున్న అరవం ఏదో త్వరగానే వచ్చేస్తుందిలే, 'రేపో మాపో'

అన్నాడు.

వెంగళప్పకు చాలా సంతోషం వేసింది. "దీన్ని అస్సలు మరిచిపోకూడదు! 'రేపో మాపో'" అని బిగ్గరగా అనుకుంటూ వెనక్కి పోసాగాడు.

వాడు పోయే దారిలోనే పాపం, ఎవరికో జబ్బు చేసి ఉంది. ఊళ్ళో వాళ్ళంతా వచ్చి వాళ్లని పరామర్శిస్తున్నారు. వెంగళప్ప వాళ్లకేసి చూస్తూ "రేపో మాపో- రేపో మాపో" అన్నాడు. దాంతో ఊళ్ళో వాళ్ళంతా వెంగళప్ప మీదికి దూకి దబదబా బాదేసారు.

లబోదిబో మన్న వెంగళప్ప చివరికి ధైర్యం చేసి "ఇంతకీ నేనేమి అనాలో చెప్పండి" అన్నాడు.

"అనుమానం ఏమున్నది, "అయ్యో పాపం" అనాలి!" అన్నారు వాళ్ళు.

"అయ్యో పాపం- అయ్యో పాపం!" అని గట్టిగా అంటూ సాగాడు వెంగళప్ప.

కొంచెం దూరం పోయే సరికి అతనికి ఓ పెళ్ళి ఊరేగింపు ఎదురైంది.

వెంగళప్ప "అయ్యో, పాపం" అంటుంటే వాళ్లకు ఎక్కడలేని కోపం వచ్చింది.

వాళ్ళు వాడిని నాలుగు అంటుకొని, "అలా అనకూడదురా, 'కనుల విందుగా ఉంది' అనాలి" అని చెప్పారు.




ఆసరికే ఏమనాలో మర్చిపోయిన వెంగళప్ప ఇప్పుడు బిగ్గరగా "కనులవిందుగా ఉంది- కనుల విందుగా ఉంది" అంటూ పోసాగాడు.

ఆ ఊరు దాటాడో లేదో వాడికొక కొట్టం కనిపించింది. అది తగలబడుతుంటే, ఊళ్ళో వాళ్ళు దాన్ని ఆర్పేందుకు విఫల ప్రయత్నం చేస్తున్నారు.

"కనుల విందుగా ఉంది" అంటున్న

వెంగళప్పను చూసి వాళ్లందరికీ చిర్రెత్తుకొచ్చింది. వాళ్ళు వాడికి "అట్లా అనకూడదు- 'వర్షం పడితే బాగుండు' అనాలి" అని చెప్పారు.

ఏ పాత్రలో పోస్తే ఆ రూపాన్ని అందుకునే వాడు మన వెంగళప్ప. "సరే, దానిదేముంది? అలాగే అంటాను- 'వర్షం పడితే బాగుండు వర్షం పడితే బాగుండు'" అంటూ అక్కడినుండి బయలుదేరి వెంగాపురం పొలిమేరలు చేరుకున్నాడు.

ఇంకొద్ది సేపట్లో ఇల్లు చేరుకుంటాడనగా వాడికి తెలిసిన కుమ్మరి ఒకడు కనిపించాడు. "వర్షం పడితే బాగుండు" అంటున్న వెంగళప్పని పట్టుకొని "అవేం మాటలురా? రేపోమాపో అనైనా చేర్చు! లేకపోతే నా వ్యాపారం ఏమైపోవును?" అన్నాడతను.

"అవును! అదే సరైన మాట! రేపో-మాపో!" అని సంతోషంగా అరుచుకుంటూ ఇంట్లోకి చేరుకున్నాడు వెంగళప్ప.

"మా నాయనే! ఎంత ప్రయోజకుడి-వయ్యావురా! మంగాపురం పోయి పంతులుగారిని శాస్త్రం కనుక్కొచ్చావంటే, నువ్వింక నా చేతికి అందివచ్చినట్లే!" అని మురిసిపోయింది వెర్రి వెంగమ్మ!

**ఈ సంగతులు తెలుసా?**

1. మన దేశంలో మొట్ట మొదటి సాధారణ ఎన్నికలు జరిగిన సంవత్సరం? జ) 1950
2. "ఒరైజా సటైవా" అనేది ఏ మొక్క శాస్త్రీయ నామం? జ) వరి
3. మన రాజ్యాంగ నిర్మాణంలో అత్యధిక ప్రభావం చూపిన చట్టం? జ) 1935 భారత ప్రభుత్వచట్టం
4. సౌర కుటుంబంలో మొత్తం ఉపగ్రహాల సంఖ్య ఎంత? జ) 162
4. క్షారాల PH విలువ ఎంత ఉంటుంది? జ) 7 నుండి 14 వరకు
5. భారతదేశంలో తొలి ప్రెసిడెన్సీ బ్యాంకు? జ) బ్యాంక్ ఆఫ్ బెంగాల్
6. జీర్ణ రసాలలో ఏ ఆమ్లం ఉంటుంది? జ) హైడ్రోక్లోరిక్ ఆమ్లం
7. భారతదేశంలో అతి ఎత్తయిన కాంక్రీట్ డ్యాం ఏది? జ) నాగార్జునసాగర్



# మిత్రుల సాహసం

*రచన: శ్రీకాంత్ రెడ్డి, 10 వ తరగతి, తేజ విద్యాలయ, కొమర బండ, నల్గొండ జిల్లా.*

స్వామి, శాంతకుమార్ ఇద్దరూ మంచి స్నేహితులు. ఇద్దరూ కలిసి ఉండేవాళ్ళు, కలిసి చదివేవాళ్ళు, ఎక్కడికి వెళ్ళినా ఇద్దరూ కలిసే వెళ్ళేవాళ్ళు. ఇద్దరూ మంచి ధైర్యస్తులు కూడా,

అయితే మరి వేసవికాలం వచ్చింది. సెలవల సమయం; మిత్రులిద్దరూ విడిపోయే సమయం కూడా- ఎందుకంటే మరి, స్వామి శాంతకుమార్‌లవి వేరు వేరు ఊళ్లు!

"ముందు నువ్వు కొన్ని రోజులు మా ఊరికి వస్తే, తర్వాత నేను కొన్ని రోజులు మీ ఊరికి వస్తాను" అని బేరం పెట్టాడు శాంతకుమార్. ఇంట్లో వాళ్లని అడిగితే వాళ్ళూ సరేనన్నారు. దాంతో స్వామి, శాంతకుమార్ ఇద్దరూ కలిసి శాంత వాళ్ల తాతగారి ఊరు- వెంకట్రామాపురం- వెళ్ళారు.

వెంకట్రామాపురంలో పాడు బడ్డ కోట ఒకటి ఉంది. ఊళ్ళోవాళ్ళందరికీ అదంటే భయం. ఎవ్వరూ అటువైపుకు వెళ్ళేవాళ్ళు కాదు- ముఖ్యంగా చీకటి పడిందంటే, ఇంక అటువైపుకు చూడాలంటే కూడా భయపడేవాళ్ళు అందరూ. కారణం ఏముంది- దయ్యాలు!

"ఆ కోటలో ఇదివరకు అనేక యుద్ధాలు జరిగాయి. అనేకమంది సైనికులు అకాల మృత్యువు పాలయ్యారు. వాళ్ళంతా దయ్యాలయ్యారు. ఇనప గొలుసుల్ని ఈడ్చుకుంటూ రాత్రంతా అటూ ఇటూ తిరుగుతుంటారు.." ఇది విన్నాక మిత్రులిద్దరికీ ఉత్సాహంతో అసలు ఏ మాత్రం నిద్రపట్టలేదు.

"అసలు ఆ మహల్‌లో ఏముందంటావురా?" అడిగాడు స్వామి.

"ఏమోరా! ఎవరో మనుషులే అయి ఉంటారు. కానీ అక్కడ ఎందుకు ఉంటున్నారు? ఏం చేస్తున్నారు?" అడిగాడు శాంతకుమార్.

"కనుక్కోవాల్సిందే!" అన్నాడు స్వామి.

"మరింకేం? ఇవాల్టి రాత్రే ముహూర్తం!" అన్నాడు శాంతకుమార్.

ఆ రోజు రాత్రి పన్నెండు గంటలకు మ్రోగేట్లు అలారం పెట్టుకున్నారు పిల్లలిద్దరూ. ఇంట్లో వాళ్లకు తెలిస్తే తిడతారు. అందుకని వాళ్లకెవ్వరికీ ఏమీ చెప్పలేదు.

సెల్‌ఫోను చేతపట్టుకొని, దాని వెలుతురులో మెల్లగా పురాతన మహల్ దగ్గరికి వెళ్ళారు- గట్టిగా మాట్లాడుకుంటూ.

వాళ్ళు మహల్ ప్రాంతాలకు చేరుకునేటప్పటికి సమయం దాదాపు ఒంటిగంట అవుతున్నది. అ ప్రదేశం అంతా నిర్మానుష్యంగా, జీవం లేనట్లు స్తబ్దుగా ఉన్నది.

పిల్లలిద్దరూ మహల్ ద్వారం వద్దకు వెళ్లారో, లేదో- కోట వెనకవైపు ఆకాశంలో భయంకరంగా ఒక మెరుపు మెరిసింది. ఉరుములు ధబధబా ఉరిమాయి. అకస్మాత్తుగా మహల్ కిటికీలోంచి వాళ్ళ

మీదికి వెలుతురు ప్రసరించింది. ఆ వెలుతురులో ఏదో వింత ఆకారపు నీడ ఒకటి.. వాళ్ళవైపుకే చూస్తున్నట్లు నిలబడి ఉంది..




పిల్లలిద్దరూ గబగబా వెనక్కి పరుగెత్తారు. అంతలోనే ధడధడ మంటూ భయంకరమైన శబ్దం, వెలుగు! పెద్ద పిడుగులాంటిదేదో వచ్చి మహల్‌లో ఎక్కడో పడింది.

స్వామి, శాంత కుమార్ ఇద్దరూ ఇల్లు చేరుకునేంత వరకూ ఇక ఎక్కడా ఆగలేదు.

"భయపడ్డావా?" అడిగాడు స్వామి.

"అస్సలు లేదు. నువ్వు?" అడిగాడు శాంతకుమార్.

"అక్కడ ఉన్న నీడ మనిషిదైనా అయి ఉండాలి, లేదా ఏదైనా బొమ్మదైనా అవ్వాలి. నీడ కావాలంటే అసలు కాంతి కావాలి. మనల్ని చూసి ఎవరో అక్కడి లైట్లను ఆన్ చేసారు. కాబట్టి అక్కడ మనుషులు తప్పని సరిగా ఉన్నారు. వాళ్ళు ఎవరో దుష్టకార్యాలు చేసే వాళ్ళే- మంచి వాళ్ళైతే కాదు. మరి ఏం చేద్దామంటావు?" అడిగాడు స్వామి.

"అవును. రాత్రి మనం నిలబడ్డ ద్వారం ప్రక్కనుండే కొన్ని కరెంటు వైర్లు మహల్ లోపలికి వెళ్ళాయి చూసావా? పాత కాలపు మహల్‌కి అసలు కరెంటు వైర్లు, లైట్లు అవసరం లేదు కదా! అవి అక్కడికి ఎలా వచ్చాయి? ఇది ఏదో మోసమే!" అన్నాడు శాంతకుమార్.

శాంతకుమార్ వాళ్ల తాతయ్య పాతకాలంలో ఆ ఊరికి పట్వారీగా పని చేసి ఉన్నాడు. శాంత కుమార్ ఆయనకు సంగతి మొత్తం చెప్పాడు. ఆయన కొంచెం ఆలోచించి, "సరే రండి- మిమ్మల్ని మన సర్పంచ్ గారికి పరిచయం చేస్తాను. పట్నం పిల్లల మాదిరి, ఆయనతో ముచ్చట్లు పెట్టి, ఊరి విషయాలు

కనుక్కోండి. ఆయన మంచాయనే, ఏమీ పర్లేదు" అని వాళ్లని సర్పంచ్ దగ్గరికి తీసుకెళ్ళాడు తాతయ్య.

సర్పంచ్ గారు మంచి మనిషి. ఊరి చరిత్రను అడిగిన పిల్లల్ని చూసి ఆయన చాలా ముచ్చట పడ్డాడు. వాళ్లకి చరిత్ర అంతా చెప్పాడు: "కోటలో ఇప్పుడు ఎవ్వరూ లేరు. కరెంటూ లేదు, ఏమీ లేదు. ఊళ్ళోవాళ్ళు కోటకు భయపడతారు. అది మామూలే. కోట వెనక పొలాలున్నాయి. అవును- మోటార్లు ఆడతాయి. అక్కడ ట్రాన్సుఫార్మర్ ఉంది ఒకటి. మంచి భూములు. పంటలు పడుతాయి బాగానే"

ఆరోజు రాత్రి ఏడు గంటల సమయంలో తాతయ్య చేత పోలీసులకు ఫోన్ చేయించారు పిల్లలిద్దరూ. అయితే పోలీసులు వచ్చే లోగానే బయలుదేరి కోట వెనక్కి వెళ్ళారు, ఆయన్ని కూడా వెంటబెట్టుకొని.

అక్కడి ట్రాన్సుఫార్మర్ దగ్గరో మనిషి కరెంటు వైర్లని తగిలిస్తున్నాడు. "మన ఊరి మనిషి కాదు" అన్నాడు తాతయ్య. "సరే,అయితే రా, మరి! అంటూ మెల్లగా వెళ్ళి, ఆ మనిషి ముఖం మీదికి తను తెచ్చిన గోతాం విసిరేసాడు స్వామి. అతను తేరుకునేలోగా తాతయ్య తన చేతి కట్టెతో అతని గుండు మీద బాదాడు. అతను క్రింద పడగానే ఇద్దరూ కలిసి అతని కాళ్ళు చేతులు కట్టేసారు.



ఆలోగా శాంతకుమార్ మెల్లగా కోట వెనక వైపు నుండి గడియ తీసి కోట లోపలికి దూరాడు. అక్కడ గ్రుడ్డి వెలుతురులో చాలా వైర్లు కనిపించాయి. అటు ప్రక్కనే ఒక

కంప్యూటర్ కూడా ఉన్నది. అతను ఆశ్చర్యపోయి చూస్తూండగానే హటాత్తుగా తెల్ల బట్టలు ధరించిన ఆకారం ఒకటి అతని మీదికి దూకింది. శాంతకుమార్ చురుకుగా ప్రక్కకు దూకటం, ఆ ఆకారం కాలు అక్కడ ఉన్న వైరుపై పడటం ఒకేసారి జరిగిపోయాయి. మరుక్షణం అక్కడంతా మెరుపులు! తెల్లబట్టల మనిషి ఒకడు పెద్దగా అరిచి, తన్నుకులాడుతూ క్రింద పడ్డాడు!

శాంతకుమార్ అతన్ని కట్టెతో ప్రక్కకు నెట్టి, అతను ధరించిన బట్ట పీలికలతోటే అతని కాళ్ళు చేతులు కట్టేసాడు.

అక్కడి పెట్టెల్లో కరెన్సీనోట్ల కట్టలు చూసి పిల్లలిద్దరితో పాటు తాతయ్య కూడా నోరు తెరిచాడు.

"వీళ్ళు ఎవరంటూరా? ఇన్ని డబ్బులు ఎక్కడివి వీళ్లకు?" అడిగాడు తాతయ్య ఆశ్చర్యంగా.

"నెల క్రితం మా మండలంలో ఉన్న బ్యాంకులో దొంగలు పడి, కోటి రూపాయలపైగా నోట్ల కట్టల్ని ఎత్తుకెళ్ళారు తాతయ్యా! ఆరోజున, మరుసటి రోజున కూడా ఊళ్ళోకి చాలామంది పోలీసులు వచ్చారు. ఆ దొంగల జాడ ఇంకా తెలియలేదు. "వాళ్ళే వీళ్ళు" అని నా అనుమానం" చెప్పాడు స్వామి.

అంతలోకే పోలీసు జీపు అక్కడికి చేరుకున్నది. "ఎవరు వీళ్ళు, ఇక్కడ ఏం చేస్తున్నారు?" అని అడిగారు వాళ్ళు. అంతలోకే వాళ్ళ చూపు అక్కడున్న నోట్ల కట్టల మీద పడింది. "వీళ్ళు.. వీళ్ళు.." అన్నారు.

"అవును. బ్యాంకు దోపిడీ చేసింది వీళ్ళే- ఇక్కడికి వచ్చి దాక్కున్నారు" చెప్పారు పిల్లలిద్దరూ.

పోలీసులు దొంగలిద్దరికీ బేడీలు వేసారు.

పిల్లల ధైర్య సాహసాలకు మెచ్చిన ప్రభుత్వం వాళ్లకు ప్రత్యేక బహుమతిని ఇచ్చింది. ఊళ్ళో వాళ్లంతా వాళ్లని బలే మెచ్చుకున్నారు.






# సైనికులు

*రచన : డి.గౌతమ్, 7 వ తరగతి, దిల్సుఖ్ నగర్ పబ్లిక్ స్కూల్, ఆర్కేపురం, హైదరాబాదు.*

ఆగస్టు 14. స్వాతంత్ర దినోత్సవానికి ముందురోజు. అన్ని బడులలో లాగే ఢిల్లీ పబ్లిక్ స్కూల్‌లో కూడా స్వాతంత్ర్య వేడుకలు జరగనున్నాయి. ఏర్పాట్లన్నీ చకచకా జరుగుతున్నాయి. అందరూ ఆ కార్యక్రమం గురించే మాట్లాడుకుంటున్నారు.

బడిలో చదివే రాహుల్ మటుకు మౌనంగా కూర్చొని ఉన్నాడు. అతని స్నేహితుడు సుధీర్ అన్నాడు- "రాహుల్! రేపు మన తరగతి వాళ్ల నాట్యరూపకం ఉంటుంది- ఉదయం ఎనిమిదికల్లా వచ్చేయాలి అందరం- గుర్తుందిగా, ఒకసారి ప్రాక్టీసు చేసుకొని, ఆ వెంటనే ప్రదర్శన!" అని.

"నాకు అసలు ఆసక్తి లేదు. నేను చెయ్యను. అసలు బడికే రాను. ఇంట్లోనే ఉండి సినిమా చూస్తాను" అన్నాడు రాహుల్.

"సినిమాలు ఎప్పుడూ చూసేవే కదరా, ఇట్లా అందరం కలిసి ఏదైనా కార్యక్రమం జరుపుకొనేది ఎప్పుడో ఒకసారి. రా, దానిదేముంది. మజా వస్తుంది" ఒప్పిస్తున్నట్లు అన్నాడు సుధీర్.

"ఏముంది, ఎవరో గెస్టులు వస్తారు, ఏదో మాట్లాడతారు; మనల్ని ఎండలో నిలబెట్టి, కూర్చోబెట్టి చంపుతారు; ఆ తర్వాత సర్కస్‌లో జంతువుల మాదిరి మన చేత గంతులు వేయిస్తారు వాళ్ల ముందు. నాకు అట్లాంటివి ఇష్టం ఉండదు" అన్నాడు రాహుల్.

"అట్లా అనకు! మన బడికి ఈసారి వచ్చే గెస్టు చాలా మంచివాడట. 'మనం అతనినుండి చాలా నేర్చుకోవచ్చు' అని చెప్పారు సోషల్ సార్. అయినా నాకోసం రారా, ఈ ఒక్కసారికే!" ప్రాధేయపడ్డాడు సుధీర్.

"సరేలే! వస్తా! కానీ ఈ ఒక్కసారికే! మళ్ళీ మళ్ళీ రమ్మనకూడదు!" దిగి వచ్చాడు రాహుల్.

తరువాతి రోజు తెల్లవారుతూనే సుధీర్ ఫోను.."బయలుదేరుతున్నావుగా?" అని.



దాంతో ఇష్టం లేకపోయినా, బలవంతంగా బడికి బయలుదేరాడు రాహుల్. మొదట్లో జెండా వందనం.. అయిపోగానే ఎవరో పాటలు పాడారు; రికార్డు చేసిన పాటలు పెట్టి నాట్యం చేసారు కొందరు. ఏవీ అంత ఆసక్తికరంగా లేవు. రాహుల్‌కి విసుగు వచ్చింది. 'లేచి వెళ్ళిపోదామా' అనుకున్నాడు.

అంతలో "ఇప్పుడు మన అతిథి, మేజర్ శ్రీరామ్ మన దేశం గురించి కొద్ది మాటలు

మాట్లాడతారు" అని అనౌన్సు చేసారు హెడ్మాస్టరు గారు.

మేజర్ శ్రీరాం ఎత్తుగా, బలంగా, ఆకర్షణీయమైన యూనిఫారం ధరించి ఉన్నాడు. ఆయనకు వచ్చిన మెడల్స్ కావచ్చు, రంగులు రంగులుగా ఆయన జేబునుండి వ్రేలాడుతున్నాయి. ఆయన వచ్చి మైకు పట్టుకొని గంభీరమైన స్వరంతో మాట్లాడసాగాడు-



"ప్రియమైన పిల్లలారా! అందరికీ స్వాతంత్ర్య దినోత్సవ శుభాకాంక్షలు! ఈసారి స్వాతంత్ర్య దినోత్సవాన్ని మీ మధ్య జరుపుకోవడం నాకు చాలా ఆనందంగా ఉంది. గత సంవత్సరం ఈ సమయానికి నేను పంజాబ్ రాష్ట్రం అవతల సరిహద్దులో ఉన్నాను. ఆ రోజు నాకు ఇంకా గుర్తున్నది. మేం జెండా ఎగరేసి సెల్యూట్ చేసామో లేదో, మా పటాలంలోకి ఒక గ్రెనేడ్ వచ్చి పడ్డది. మీకు తెలుసు కదా, గ్రెనేడ్ పేలితే ఆ చుట్టు ప్రక్కల ఉన్నవాళ్ళు పది మందైనా ముక్కలు ముక్కలైపోతారు. మాకెవ్వరికీ ఏం చేయాలో తెలీలేదు. ఆ సమయంలో మీరైతే ఏం చేసి ఉండేవాళ్ళు?" ఆగాడాయన.

"పారిపోయేవాళ్లం" అన్నారెవరో. అందరూ నవ్వారు.

ఆయన నవ్వలేదు. చెబుతూ పోయాడు "గ్రెనేడ్ ప్రక్కనే ఉన్నాడు సుబేదార్ మానిక్ సింగ్. అతను మా ప్లాటూన్ వాడే.. తను వెంటనే ఆ గ్రెనేడ్‌ని చేతిలో పట్టుకొని బయటికి పరుగెత్తాడు. శత్రువులు ఎక్కడ ఉండి ఉంటారో ఊహించుకొని దాన్ని అటువైపుకు విసిరేసాడు!

అంతలోనే మొత్తం పొగ అలుము కున్నది.

ఎక్కడెక్కడినుండో తుపాకీలు పేలుతు-న్నాయి. గ్రెనేడ్ పేలింది.. ఎనిమిది మంది శత్రు సైనికులు హతమయ్యారు! మిగిలినవాళ్ళు మమ్మల్ని చుట్టుముట్టారు. మేమందరం ఆత్మరక్షణ పొజిషన్లు తీసుకున్నాం. శత్రువులు ముందుకు కదలకుండా ఆపుతూ హెడ్క్వార్టర్స్‌కు కబురుపంపాం. అదనపు బలాలు వచ్చేవరకూ అట్లా మేం కొద్దిమందిమీ శత్రువులను నిలువరించాం. తర్వాత మనవాళ్ళు రావటంతో శత్రువుల దాడి విఫలమైంది.

మేం కాపాడిన ఆ పోస్టు మన రక్షణ వ్యవస్థలో చాలా కీలకమైనది. అది శత్రువుల పాలబడితే వాళ్ళకు భరత భూభాగం లోకి ప్రవేశించటం సులభం ఐపోయేది. మీకెవ్వరికీ భద్రత లేకుండా పోయేది!"

ఆయన చెప్పిన తీరులోని ఉత్కంఠకు పిల్లలంతా నిశ్శబ్దం అయిపోయారు. ఒక్కసారి ఆపి, కొనసాగించాడు శ్రీరాం. "ఇది మీకు ఎందుకు చెబుతున్నానో అర్థమైందా, దేశాన్ని స్వతంత్రంగా ఉంచటం కోసం, సరిహద్దుల్ని కాపాడటంకోసం తమ సర్వస్వాన్నీ అర్పించి నిలచి ఉన్నది మన సైన్యం. దేశభక్తికి ఆద్యంతం ప్రతీకగా నిలిచేవాళ్ళం అంతమందిమి ఉన్నాం కాబట్టే మన దేశం ఈరోజున సమున్నతంగా నిలచి ఉన్నది. మీలో ప్రతి ఒక్కరికీ దేశభక్తి ఉందని ఆశిస్తున్నాను.

మీరు పెద్దయ్యాక రకరకాల వృత్తులు చేపడతారు. దేశానికి మేలు చేసే పనులు చేయండి. మీలోంచి కొందరైనా వీర సైనికులు రావాలని నా కోరిక.. " శ్రీరాం మాట్లాడుతున్నంత సేపూ పిల్లలు ఎంతో ఆసక్తిగా విన్నారు. ఆ రోజున శ్రీరాం మన దేశం గొప్పదనాన్ని గురించి మాట్లాడాడు. మనందరం ఎట్లా కలిసి ఉండాలో చెప్పాడు. సైన్యంలో రకరకాల ప్రాంతాలకు చెందినవాళ్ళు, మతాలకు చెందిన వాళ్ళు అందరూ ఎట్లా కలిసి పని చేస్తారో చెప్పాడు. క్రమశిక్షణ, సమయ పాలన గురించి మాట్లాడాడు. ఆ రోజున పిల్లలు మంత్ర-

ముగ్ధులైపోయారు.

ఆయన మాట్లాడటం ముగించి సెలవు తీసుకుంటుండగా రాహుల్ ఆయన దగ్గరికి వెళ్ళి అడిగాడు: "సార్! ఈ పని చాలా రిస్కు కదా, మీకు భయం వెయ్యలేదా? మీరు చనిపోతే ఎలాగ?" అని.



శ్రీరాం నవ్వాడు. "నీ పేరేంటి?" అని అడిగాడు. రాహుల్ చెప్పాడు.

ఆయనన్నారు: "చూడు రాహుల్, పెద్ద అవుతున్నకొద్దీ ఎవరికి వాళ్లం ఆలోచిస్తాం.. 'మనం ఎందుకు బ్రతకాలి? ఎట్లా బ్రతకాలి?' అని. అప్పుడు ఓ సంగతి అర్థమౌతుంది. 'మన ప్రాణం ఏమంత లెక్క కాదు. నిజంగానే, మనం ఏం చేస్తున్నాం అనేదే ముఖ్యం' అని. 'దేశాన్ని కాపాడటం ముఖ్యం' అనుకున్నప్పుడు, ఇక దానికోసం ఏం చేయాలో అది చేసేస్తాం. ప్రాణాల గురించి అసలు లెక్క చేయం" అనేసి, రాహుల్ భుజం తట్టి వెళ్లిపోయారాయన.

ఆ తర్వాత రాహుల్‌లో చాలా మార్పు వచ్చింది. 'ఊరికే బ్రతికి ప్రయోజనం లేదు- పదిమందికి పనికొచ్చే పనులు చెయ్యాలి' అనటం మొదలు పెట్టాడు. మొక్కలు నాటే కార్యక్రమాలు, గ్రామాల సందర్శన కార్యక్రమాలు- ఇట్లా బడిలో రకరకాల కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొనటం మొదలు పెట్టాడు; అనేక బహుమతులు గెల్చుకున్నాడు కూడా. ఇదివరకు అతనిలో నిండా ఉన్న అనిశ్చితత్వం, అయిష్టం ఇప్పుడు పూర్తిగా మాయమైనాయి!

రాహుల్ పదో తరగతిలో ఉండగా "మేజర్ శ్రీరాంకు మహావీర చక్ర లభించింది" అని వార్త వచ్చింది.

"నేనూ సైనికుడినౌతాను!" అన్నాడు రాహుల్, ఆ వార్తను చూడగానే. "నేను కూడా" అన్నాడు సుధీర్.




# వేషం మార్చిన యువరాజు

*రచన: పి.కార్తీక్, 4 వ తరగతి, కల్లం అంజిరెడ్డి విద్యాలయ, హైదరాబాదు.*

*సౌజన్యం: కథా పాఠశాల, రవిశంకర్ వుండి.* *మార్పు చేర్పులు: కొత్తపల్లి*

ప్రవీణుడు ఒక రాజ కుమారుడు. వయసు ఆరేళ్ళే. అయినా అల్లారు ముద్దుగా పెరగటం వల్లనో ఏమో, అతనిలో గర్వం పాలు ఎక్కువే ఉండేది. తమ వద్ద పనిచేసే వాళ్లందరితోటీ దురుసుగా ప్రవర్తించేవాడు.

ఆ సంగతి గుర్తించినా, పని ఒత్తిడిలో ఉండే రాజుగారు దాన్ని గురించి ఏమీ చేయలేదు; కానీ తగిన వయసు రాగానే అతన్ని విద్యాభ్యాసం కోసం గురుకులానికి పంపించారు.

గురుకులంలో అన్ని కులాలకు, వృత్తులకు చెందిన పిల్లలు కలిసిమెలిసి ఉండేవాళ్ళు. అందరూ రకరకాల విద్యలను, శాస్త్రాలను, కళలను అభ్యసించేవాళ్ళు.

గురువులు ఎవ్వరూ ప్రవీణుడికి రాజకుమారుడని ప్రత్యేక గుర్తింపు ఇవ్వలేదు. వాళ్ళకు పిల్లలందరూ సమానమే! పిల్లలు కూడా అతన్ని తమలో ఒకడుగానే చూసారు తప్ప, రాజకుమారుడని వేరుగా చూడలేదు. అప్పటివరకూ అహంకారంతో మెలగిన ప్రవీణుడికి అక్కడి సమానత్వపు వాతావరణం ఏమంత నచ్చలేదు. "రాజకుమారుడికి ఇదేమి శిక్ష?" అనుకోసాగాడతను.

చూస్తూండగానే సంవత్సరం గడచిపోయింది. సెలవలు ఇచ్చే సమయం దగ్గర పడింది. సెలవల ముందు గురుకులంలో సాంస్కృతిక కార్యక్రమాలు జరుగుతాయి. దానికోసం పిల్లలంతా నెల రోజుల పాటు సాధన చేస్తారు. వాళ్ళు వేయబోయే నాటకంలో ప్రవీణుడికి పనిమనిషి పాత్ర ఇచ్చారు గురువుగారు: "నాటకం రక్తి కట్టాలంటే, నటించేవాడు పాత్రలో లీనం అయిపోవాలి" అని గుర్తుచేస్తూ.

ప్రవీణుడికి ఆ నాటకం నచ్చింది. అందులో తను పనివాడు. చాలా కష్టపడి పని చేస్తాడు. యజమానిని, యజమాని ఇంటివాళ్లని మనస్ఫూర్తిగా గౌరవిస్తుంటాడు. అయినా వాళ్ళెవ్వరూ తన కష్టాన్ని గుర్తించరు. ప్రతి క్షణమూ తనని చులకనగా చూస్తారు. చివరికి అందరూ అతని మంచితనాన్ని గుర్తించటంతో నాటకం ముగుస్తుంది.




నాటకం వేయటంలో లీనమైన ప్రవీణుడికి సాధన చేస్తున్న కొద్దీ ఆ పాత్ర స్వభావం అర్థం కాసాగింది. యజమాని పరుషంగా మాట్లాడిన ప్రతిసారీ పనివాడి మనసు ఎలా గాయపడుతున్నదో అతనికి అర్థమైంది. ఎంత

పని చేస్తున్నా తృప్తి చెందకుండా "ఇంకా పని చెయ్యి" అంటూ పీడించే యజమాని 'తప్పు చేస్తున్నాడు' అని అనిపించసాగింది. నాటకం అయిపోయేసరికి అతనికి తను ఎలా జీవించాలో తెలిసిపోయింది!

సెలవులకని ఇంటికి వెళ్ళిన ప్రవీణుడిలో గొప్ప మార్పు కనబడింది అందరికీ. ఇప్పుడతను అందరితోటీ మర్యాదగా మెసలుకుంటున్నాడు. పని చేసేవారిని చిన్నబుచ్చటం లేదు సరికదా,

"నేను ఇదివరకు మిమ్మల్ని చాలా బాధ పెట్టాను. నన్ను క్షమించండి" అంటున్నాడు! అందరూ యువరాజులో వచ్చిన మార్పుకు ఆనందించారు.

**ఓ మాట...**

కొత్తపల్లిలో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. ఈసారైతే బొమ్మలు వేసిన వాళ్ళు కూడా పిల్లలే! వాళ్లంతా అనంతపురం రాధా స్కూల్‌లో ఏడు-ఎనిమిది-తొమ్మిదో తరగతులు చదువుతున్నారు. అట్లాగ, అనుకుంటే మీరూ బొమ్మలు వేయచ్చు; మీరూ కథలు రాయచ్చు!

పిల్లలను కలవటం, వాళ్ల చేత తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేసి, ఇష్టపడిన వాళ్లకు అందించటం మాకు ఇష్టం.

ఈ పనులన్నీ ఎందుకు? ఎందుకంటే ఇవి అందరికీ మేలు చేస్తాయి కాబట్టి! ఇట్లా అందరి మేలూ కోరి చేసే పనుల్లో మీ శక్తి కొద్దీ మీరూ పాలుపంచుకోండి. బాగా చదవండి! బాగా గీయండి! బాగా రాయండి! నవ్వండి! ఆలోచించండి! చక్కగా పాడండి! మంచి పౌరులుగా ఎదగండి!

**పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !**

# బొమ్మకు కథ రాయండి

*ఈ బొమ్మను చూడండి. తల్లి పిట్టకి పిల్ల అంటే ఎంత ప్రేమో చూడండి. దానికి ఇంకా రెక్కలు రాలేదని, తనే ఎక్కడినుండో పురుగును తెచ్చి పెడుతున్నది. అందరు అమ్మలూ అట్లాగే ఉంటారు అంటున్నారా? మరైతే ఈ బొమ్మని చూసి, దీనికి తగినట్లు ఒక అమ్మ కథ రాసెయ్యండి మరి ! మీరు రాసి పంపిన కథల్లో బాగున్న వాటిని కొత్తపల్లి 99 వ సంచికలో ప్రచురిస్తాం !*



కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, MRO ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి , అనంతపురము జిల్లా, ఆంధ్రప్రదేశ్-515101.



# తపన

*"చూశారా, సరస్వతీ కటాక్షం(చదువు) ఉంటే లక్ష్మీ కటాక్షం(ధనం) కూడా ఉంటుంది" అంటూ తాతగారు వ్రాసి పంపిన ఈ కథలోలాగా, మీరూ బాగా చదువుకోండి మరి !*

*రచన: శ్రీ కంచనపల్లి వేంకట కృష్ణారావు, కర్నూలు*

తాళ్లరేవులో గోపాలుడనే యువకుడు ఒకడు, పశువులు కాస్తూ ఉండేవాడు. చిన్నతనంనుండీ అదే పనిలో ఉండటం వల్లనో ఏమో, వాడు అసలు ఏమాత్రం చదువుకోలేదు. ప్రతి సంవత్సరమూ శ్రీరామ నవమికి ఆ ఊరి రామాలయంలో ఉత్సవాలు జరుగుతాయి. ఒక ఏడాది వాడు వెళ్ళేసరికి గుడిలో రామాయణ ప్రవచనం జరుగుతున్నది. వ్యాసపీఠం మీద రామాయణ గ్రంథం పెట్టుకుని చదువుతూ,

అందులోని సూక్ష్మాలను పామరులకు అర్థమయ్యేట్లు వివరిస్తున్నారు రామశర్మగారు. ఆయన గొంతూ, చెప్పే తీరూ బాగుండటంతో గోపాలుడు అక్కడే కూర్చొని ఆయన చెప్పేది ఆసాంతం విన్నాడు.



ఆయన చెప్పిన సంగతులన్నీ గోపాలుడి హృదయంలో నాటుకుపోయాయి. "అబ్బా! చదువు వచ్చి ఉంటే ఇట్లాంటి పుస్తకాలన్నీ నేనే చదవగలిగేవాడిని కదా! ఏమయినా సరే ఇవాళ్టి నుంచీ చదువు నేర్చుకోవాలి. మంచి మంచి పుస్తకాలన్నీ చదవాలి" అని గట్టిగా అనుకున్న గోపాలుడు,

సభ అయిపోగానే రామశర్మ దగ్గరికి వెళ్ళి, తన గురించి చెప్పుకొని, "అయ్యా! నాకు బొత్తిగా చదువు రాదు. కానీ బాగా చదువుకోవాలని అయితే ఉంది. రోజూ మీ సేవ చేసుకుంటాను, నాకు చదువు చెప్పండి" అని ఆయన కాళ్ళకు దండం పెట్టాడు.

గోపాలుడి జిజ్ఞాసకు రామశర్మ చాలా సంతోష పడ్డాడు. "నాయనా! రామాయణం రాసిన వాల్మీకికి కూడా మొదట్లో అసలు చదువే రాదట. చదువుకోవాలని కోరికతోటి, తగినంత కృషి చేసి అంత గొప్పవాడు అయ్యాడు. ఇవాళ్ల నీలో ఈ ఆలోచన కలిగినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. పక్క వీధిలోనే మా ఇల్లు. నువ్వు రోజూ మా ఇంటికి రా. నేను నీకు చదువు చెబుతాను. చదువుకోవాలన్న తపన ఉండాలే కాని చదువు ఏమంత కష్టం కాదు" అన్నాడు.

గోపాలుడికి చాలా సంతోషం అయ్యింది. మరుసటి రోజునుండీ ప్రతిరోజూ ఉదయాన్న

రామశర్మ వద్దకు వెళ్ళి అక్షరాలు, అంకెలు నేర్చుకోవటం మొదలుపెట్టాడు. కొన్ని నెలల్లోనే చిన్న వాక్యాలు, చిట్టి చిట్టి పద్యాలు చదవసాగాడు. ఇంకొన్ని నెలలు గడిచే సరికి కఠినమైన పద్యాలు చదవటం కూడా వచ్చేసింది. అట్లా కొద్దికాలంలోనే మంచి పుస్తకాలు చదివే స్థాయికి ఎదిగాడతను.



ఆ సమయంలో మేత మేసేందుకు వెళ్ళిన ఆవుల్లో ఒకటి తప్పిపోయింది. దాన్ని వెతుక్కుంటూ కొండ అంతా తిరిగిన గోపాలుడికి చెట్ల గుబుర్ల వెనకగా గుహ ఒకటి కనిపించింది. "అరే! ఇన్నిసార్లు ఇటు వచ్చినా ఈ గుహ ఎన్నడూ కనబడలేదే?! ఇందులో ఏముంది?" అని ఆశ్చర్యపోతూ ఆ గుహలోకి ప్రవేశించాడు గోపాలుడు. గుహ అంతా అప్పుడే ఊడ్చినట్టు శుభ్రంగా ఉంది. ఒక ప్రక్కగా ఎత్తైన రాయిమీద కొన్ని తాళపత్ర గ్రంథాలు ఉన్నాయి. గోపాలుడు ఆశ్చర్యపోయాడు. 'గుహ చుట్టు ప్రక్కల ఎవరైనా ఉన్నారేమో' అని వెతికాడు. ఎవ్వరూ లేరు. ఆ తాళపత్ర గ్రంథాలలో ఏమి రాసి ఉన్నదో చదివేందుకు ప్రయత్నించాడు. అవేవో సంస్కృత శ్లోకాలు.. గోపాలుడికి ఏవీ అర్థం కాలేదు.

"గుహలో ఎవరో ఋషి ఉంటాడల్లే ఉంది" అని సాయంత్రం చీకటి పడే వరకూ.. మర్నాటి ఉదయం వరకూ ఎదురు చూసాడు గోపాలుడు. ఎవ్వరూ రాలేదు.

"ఈ గ్రంథాలను ఒక్కసారి తీసుకువెళ్ళి, గురువుగారికి చూపించి, మళ్ళీ తెచ్చేస్తాను" అని వాటిని జాగ్రత్తగా ఊళ్ళోకి తీసుకువెళ్ళాడతను. వాటిని చూసిన రామశర్మ ఆశ్చర్యపోయాడు. అవి లోక ప్రసిద్ధి

చెందిన కారుణ్య మహాముని రచించిన సూక్తులు. ఎలా నడచుకుంటే జీవితం సక్రమంగా ఉంటుందో చెప్పే శ్లోకాలవి. ఇన్ని రోజులుగానూ వాటిని కర్ణా కర్ణిగా విని చెప్పుకునేవాళ్ళు అందరూ. కానీ ఇప్పుడు దొరికినవి, వందల సంవత్సరాల క్రితం రాసిన గ్రంథాలు! వాటి విలువ అమూల్యం!

రామశర్మ ఆ సంగతి గోపాలుడికి చెప్పి,"నాయనా! వీటిని సేకరించి గుహలో పెట్టుకున్నవాళ్ళెవరో మహాత్ములు, వీటికోసం వెతుక్కుంటూ ఉంటారు. నువ్వు వీటిని తీసుకెళ్ళి వాళ్లకు ఇచ్చి, "మీరు అనుమతిస్తే వీటి నకలు చేసుకొని, కొద్ది రోజుల్లో తిరిగి తెచ్చిస్తాను" అని అడిగి చూడు. వాళ్ళు ఒప్పుకుంటే చాలా మేలు! లేకపోతే మనకు ప్రాప్తం లేదనుకుంటాం" అన్నాడు. గోపాలుడు వాటిని పట్టుకొని గబగబా కొండ ఎక్కి చూసాడు. ఎంత వెతికినా అతనికి మళ్ళీ ఆ గుహ కనబడనే లేదు!

అతను తిరిగి వచ్చి ఆ సంగతి చెబితే రామశర్మ సంతోషానికి అవధులు లేకుండా పోయింది: "నాయనా! నువ్వు నిజంగా సరస్వతీపుత్రుడివే! చదువుకోవాలనే తపన నీకు ఈ అవకాశాన్ని ఇస్తున్నది. ఇన్ని శతాబ్దాలుగా ఎవ్వరికీ లభించని మహోన్నత గ్రంధాలు నీకు లభించాయంటే ఆ మహాముని కరుణ సంపూర్ణంగా నీ మీద ఉన్నట్లే" అని చెప్పి, అతనికే ఆ గ్రంధాల నకళ్ళు తీసే పనిని అప్పగించాడు.

గోపాలుడు గుండ్రని అక్షరాలతో ఆ గ్రంథాలకు అనేక నకళ్ళు తయారు చేశాడు. ఆ ప్రతులను కొన్నింటిని వేరు వేరు పాఠశాలలకు ఇచ్చాడు రామశర్మ. అక్కడి ఉపాధ్యాయులు ఆయన సహకారంతో ఆ సూక్తుల్ని, జీవిత సత్యాలను పిల్లలకు బోధించసాగారు.

ఈ సంగతులన్నీ రాజుగారికి తెలిసేసరికి, ఆయనే స్వయంగా తన పరివారంతో సహా ఆ గ్రామానికి వచ్చి, రామశర్మను, ఆ గ్రంధాలను దర్శించుకున్నాడు. గోపాలుడిని మెచ్చుకొని, "రామశర్మగారూ! చదువు పట్ల ఇతనికి చాలా ఆసక్తి అని తెలిసి సంతోషించాము. ఇతనికి

అయ్యే ఖర్చుల్ని పూర్తిగా మేమే భరిస్తాం. తమరు చదువులో గోపాలుణ్ణి దిట్టగా తయారుచేయండి. భవిష్యత్తులో అతనికి మా ఆస్థానంలోనే తగిన ఉద్యోగం ఇస్తాము" అని చెప్పారు రాజుగారు.

గోపాలుడి కళ్ళు ఆనందంతో మెరిశాయి.

"మీరు సరేనంటే ఈ తాళపత్ర గ్రంథాలను రాజధానిలోని సంగ్రహాలయంలో పెట్టిస్తాను. ఆ విధంగా దేశ విదేశాల వారు వాటిని చదివే అవకాశం ఉంటుంది" చెప్పారు రాజుగారు.

"అంతకన్నా భాగ్యం ఏముంటుంది మహారాజా!" అని ఆ గ్రంథాలను రాజుగారికి అప్పగించారు రామశర్మ, గోపాలుడు.

ఇక ఆ తరువాత గోపాలుడి చదువు అద్భుతంగా సాగింది. అతను ఇక అనేక గ్రంథాల మీద, శిలాశాసనాలమీద పరిశోధనలు చేసాడు; పలు పరిశోధనా గ్రంథాలను వెలువరించాడు. కొంత కాలానికి రామశర్మ అనుమతితో రాజుగారి కొలువులో ఆయనకు సలహాదారుగా చేరాడు. "చదువు పట్ల ప్రేమ ఉంటే చాలు- అది మనల్ని ఎన్నో ఉన్నత శిఖరాలకు చేరుస్తుంది" అని చెప్పేవాడతను, అందరికీ.






# ఎలుక-పాముల స్నేహం

*"తెలివితేటలు ఉంటే మృత్యుముఖంనుండి కూడా బయట పడచ్చు" అంటూ అన్నయ్యగారు రాసి పంపారు ఈ కథని. చదివి ఎలా ఉందో చెప్పండి!*

*కథనం: అఖిలాశ, బెంగుళూరు.*

అనగా అనగా ఒక ఊళ్ళో పాములు పట్టేవాడు ఒకడు ఉండేవాడు. పాములను ఆడించుకుంటూ బ్రతికేవాడతను. ఒకరోజు అతనికి బ్రతికి ఉన్న ఎలుక ఒకటి దొరికింది. అతను వెంటనే దాన్ని తన పాము బుట్టలో వేసేసాడు. "బాగుంది- ఇన్నాళ్ళకు పాముకు తగిన ఆహారం దొరికింది" అని నవ్వుకున్నాడు.

ఇక ఆ బుట్టలోపల ఉన్న పాము చాలా ఆకలి మీద ఉంది. ఎలుకను చూడగానే చటుక్కున దాని మీదికి దూకి పట్టుకున్నది. ఇంకొక్క క్షణంలో దాన్ని మ్రింగేస్తుందనగా సమయస్ఫూర్తి ఉన్న ఎలుక కిచకిచలాడుతూ- "ఓయ్!హలో! నీకు చాలా

రోజులనుండీ ఆహారం సరిగ్గా లేనట్లుంది. అయినా ముందు నేను చెప్పేది విను, ఒక్క నిముషం: నువ్వు గనక నన్ను తినకుండా వదిలేసావంటే నేను నీకు చాలా గొప్ప సహాయం ఒకటి చేస్తాను. ప్లీజ్- నేను చెప్పేది విను" అన్నది.




ఎలుకను మ్రింగేందుకు నోరు బార్లా తెరిచిన పాము నవ్వింది. "చెప్పు, ఏం సాయం చేస్తావు?" అన్నది.

"నేను నిన్ను ఈ బుట్టలో నుండి విడిపించగలను!" అన్నది ఎలుక.

"చావబోతూ కూడా పరాచకాలు ఆడుతున్నావు. బలే ఎలుకవి దొరికావు. ఇంత పెద్ద పామును నేనే వీడి బుట్టలో చిక్కుకొని బయటపడలేక పోతున్నాను. ఒట్టి ఎలుకవు- నువ్వు నన్ను ఎట్లా విడిపిస్తావు?" అంది పాము, ఎలుకను నోట్లో పెట్టుకోబోతూ ఆగి.

ఎలుక ధైర్యవంతురాలు. "సరే, నమ్మకం లేకపోతే నీ ఇష్టం. మళ్ళీ నన్ను అనకు- ఇప్పుడైతే నీకు రెండు అవకాశాలున్నై: నన్ను తినేసి జీవితాంతం వీడి చెరలోనే ఉండిపోతావా, లేకపోతే ఇప్పుడు కొంచెం సేపు ఆకలికి తట్టుకొని, జీవితాంతం స్వేచ్ఛగా బ్రతకగలవేమో చూస్తావా.. ఆలోచించుకో" అన్నది.

పాము ఆలోచనలో పడింది. "నిజమేలే. ఇది ఎట్లాగూ తప్పించుకోలేదు. నన్ను తప్పించకపోతే నేను కొంచెం సేపటి తర్వాతనైనా దీన్ని తినేస్తాను. అట్లాకాక ఇది నన్ను విడిపించిందనుకో, అప్పుడు దీన్నీ తినచ్చు, ఇంకా ఏమైనా కూడా తినచ్చు!" అనుకొని, "సరే, కానియ్యి. ముందు నన్ను ఇక్కడి నుండి విడిపించు, చూద్దాం" అన్నది.

వెంటనే ఎలుక పనిలోకి దిగింది. తనకున్న

వాడి పళ్లతో ఆ వెదురు బుట్టను కొరకటం మొదలు పెట్టింది. మెల్లగా కన్నం పెద్దది అవ్వసాగింది. సరిగ్గా ఎలుక పట్టేంత కన్నం అవ్వగానే అది ముందు అందులోంచి దూరి బయటికి వెళ్ళింది. బయటినుండే కన్నాన్ని పెద్దది చేసి, "ఆఁ.. ఇప్పుడు బయటికి రా" అంటూ చటుక్కున అటు ప్రక్కనే ఉన్న ఒక చిన్న రంధ్రంలోకి దూరిపోయింది.

పాము జరజరా బుట్టలోంచి బయటికి వచ్చింది. స్వేచ్ఛా వాయువుల్ని పీల్చుకున్నది. ఎలుకకోసం చుట్టూ కలయ జూసింది. ఎలుక దూరిన రంధ్రం దగ్గర ముఖం పెట్టి, "ఏమైంది, బయటికి రా, ఇద్దరం కలిసి పారిపోదాం, ఇక్కడినుండి!" అన్నది.

"నిన్ను విడిపిస్తానన్నాను, నా మాట నిలుపుకున్నాను. ఇప్పుడు నువ్వు ఇంక ఎట్లా తప్పించుకుపోతావో నీ యిష్టం. ఇకపైన నీ దారి నీది, నా దారి నాది" అన్నది ఎలుక, రంధ్రంలో ఇంకా లోపలికి ముదుగుకొని.

"అదేంటి, మనిద్దరం స్నేహితులం! కలిసి ధైర్యంగా పారిపోవచ్చు, రా!" అన్నది పాము.

"అయ్యో, బాగుంది సంబరం. మనం స్నేహితులం ఎట్లా అవుతాము? అప్పుడంటే ఏదో ప్రాణాపాయ సమయం. నా ప్రాణాలు కాపాడుకోడానికి అట్లా చేశాను; నీ ప్రాణాలకోసం నువ్వు అట్లా చేసావు. ఇప్పుడు మన అసలు లక్షణాలు బయట పడతాయి. అందుకని, మన స్నేహం చెల్లదు గానీ, ఇక వెళ్ళిరా, పాములవాడు వచ్చేలోపు తప్పించుకో, పో!" అన్నది ఎలుక.




"అమ్మో! ఈ ఎలుక చాలా తెలివైనది- నాకు దొరకదు. ముందు పారిపోతే, ఆ తర్వాత కడుపాత్రం మళ్ళీ చూసుకోవచ్చు కానివ్వు" అని ఇక వెనక్కి తిరిగి చూడకుండా జారుకున్నది పాము.

అవకాశం అరుదుగా లభిస్తుంది. వివేకి ఎన్నడూ దాన్ని వదులుకోడు.




# కుంటు పడిన ఆశీస్సు

*రచన: శ్రీ చొప్ప వీరభద్రప్ప, అనంతపురం.*

అనగా అనగా ఓ అగ్రహారంలో విద్యానాథుడనే ఆకతాయి పిల్లవాడు ఒకడు ఉండేవాడు. వాడు చేసే తుంటరి పనులకు విసిగిపోయిన అమ్మా నాన్నలు వాడికి పదేళ్ల వయసు రాగానే "దేవుడా! పదేళ్లపాటు మమ్మల్ని కాపాడావు! అంతే చాలు!" అంటూ మొక్కులు తీర్చుకొని, ఆ వెంటనే పేరున్న ఓ గురుకుల పాఠశాలలో పిల్లవాడిని చేర్పించేసి, చేతులు దులుపుకున్నారు. ఆ గురుకులం దట్టమైన ఓ అడవి మధ్యలో ఉండేది. ఎటు వెళ్ళాలన్నా చాలా దూరం. అట్లాంటి చోట ఉంచితే తప్ప కొడుకు దారిలోకి రాడని తల్లిదండ్రుల ఆలోచన.

ఆ గురుకులానికి ఆచార్యుడు కమల-నాథుడు. ఆయన చాలా మంచివాడు, విద్వత్తుగలవాడు. అనేక మంది విద్యార్థులకు వేదవిద్యను ఉచితంగా బోధించేవాడు.

ఆయన అదుపు-ఆజ్ఞలలో పెరిగిన విద్యానాథుడు మంచి విద్యావంతుడైతే ఐనాడు; కానీ వినయ విధేయతలు లేని విద్య ఎంత నేర్చీ ఏం ప్రయోజనం?! అతని అహంకారం పెరిగి సముద్రమంతైంది.




వయస్సు పెరిగే కొద్దీ విద్యానాథుడు చాల గర్విష్ఠిగా తయారైనాడు: "నేను ఆషామాషీ విద్యార్థిని కాదు! అద్భుతమైన తపస్సం-పన్నుడిని! మంత్ర శాస్త్రాన్ని పూర్తిగా ఔపోసన పట్టిన వాడిని! గురువుగారు కమల-నాథులంతటి వాడిని! నాకు కోపం తెప్పిస్తే ఎవరినైనా శపించగలను! నా మంత్రాలకు తిరుగుండదు! నా నోటిమాటే మంత్రం!" అంటూ తోటి విద్యార్థులను, తన కంటే చిన్నవాళ్లని బెదిరించటం మొదలు పెట్టాడు.

రాను రాను గురుకులంలోని విద్యార్థులంతా అతని నోటి మాటకు భయపడి, అణిగి-మణిగి ఉండటం నేర్చుకున్నారు. 'ఇతను గురుకులాన్ని విడిచి ఎప్పుడు వెళ్ళిపోతాడా' అని ఎదురు చూడటం మొదలుపెట్టారు.

అనుకున్నట్టే ఒక రోజున గురువుగారు అతన్ని పిలిచి, "నాయనా! విద్యానాథా! ఇంతటితో నీ విద్యాభ్యాసం పూర్తయింది. ఇప్పుడిక నువ్వు మీ ఊరికి తిరిగి వెళ్లవచ్చు. నేను నేర్పిన ఈ విద్యలతో ప్రజలకు మేలు చేస్తూ, సుఖంగా జీవించు. పది మందికి మేలు చేస్తూ మంచి పేరు సంపాదించుకో" అని, ఆశీర్వదించి పంపాడు.

ఆ వెంటనే విద్యానాథుడు ఒక ఎత్తైన రాతిమీద కూర్చొని, విద్యార్థులందర్నీ పిలిచాడు. "ఇదిగో! నేను ఇక ఊరికి వెళ్తున్నాను. గురువుగారి అనుజ్ఞ అయ్యింది" అన్నాడు.

అందరూ సంతోషంగా ఊపిరి పీల్చుకొని "సరే, పోయి రా!" అన్నారు.

"పోతాను- పోతాను. ముందు మీరంతా నా ఆశీర్వాదం తీసుకొని తరించండి. నా అంతటి తపస్సంపన్నుడు మళ్ళీ మీకు దొరకునో, లేదో!" అన్నాడు విద్యానాథుడు.

అందరూ బిత్తరపోయారు. అయినా ఇది ఎప్పుడూ ఉండే వ్యవహారమే గనక, అందరూ అతనికి సాష్టాంగ నమస్కారం చేసి, అతని ఆశీస్సులు పొందారు.

అట్లా బయలు దేరిన విద్యానాథుడు ఒక పల్లెటూరు చేరినాడు. అక్కడ ఒక గుడి దగ్గర కూర్చుని, "నేను కమలనాథుని వద్ద విద్య పూర్తి చేసిన మహా పండితుడిని! మీరంతా నా ఆశీర్వాదాలు తీసుకుంటే, మీకు, మీ గ్రామానికీ మంచి జరుగుతుంది" అన్నాడు.

ఆ పల్లెటూరివాళ్ళు ఉత్త అమాయకులు. వాళ్ళంతా భయ భక్తులతోటి వరసలు వరసలుగా వచ్చి, ఈయనకు కానుకలు సమర్పించి, ఆయన ఆశీస్సులు పొందారు.




అట్లా మొదలుపెట్టి, విద్యానాథుడు తన దారి పొడవునా వచ్చే పల్లెల్లో అంతటా ఆగి, అందరినీ పిలిచి పిలిచి ఆశీర్వదిస్తూ, వాళ్ళిచ్చే కానుకలను ఆనందంగా స్వీకరిస్తూ పోయాడు.

అట్లా ఒకచోట జమ అయి పాదనమస్కా-రాలు చేస్తున్న పల్లెవాళ్లలో ఎనభై ఏండ్ల ముసలాయన కూడా ఒకడు ఉన్నాడు. ఆయన నిలబడే విద్యానాథుడికి రెండు చేతులూ జోడించి నమస్కరిస్తూ "స్వామీ! తమరు చూడగా ఇంత చిన్నవయస్సు.

అంతలోనే వేదాలు, వేదాంగాలు సర్వం చదివానంటున్నారు. నిజమా?! ఇంతకీ ఇప్పుడు తమరి వయస్సెంత స్వామీ?!" అని అడిగేసాడు.

ఆ మాటలు వింటూనే "ఆశీర్వాద స్వామి" తోక త్రొక్కిన త్రాచుపాములాగా అగ్గిమీద గుగ్గిలం ఐపోయినాడు. "ఏమిరా! నీకు ఇంత కండ కావరము?! మా శక్తి సామర్థ్యాలనే శంకిస్తావురా?! మా వయస్సునే అడుగుతావా! మేము మంత్రం చదివితేనే దేవుళ్ళకు శక్తులొస్తాయి. లేదంటే అవి వట్టి రాళ్ళే! అంతటివాడనైన నేను, ఈ మారుమూల మీ పల్లెకు వస్తే, 'మా జన్మ చరితార్థమైనదంటూ నా పాదాలకు వంగి నమస్కరించి ఆశీర్వాదం యాచింపక, నన్నే ప్రశ్నిస్తావురా? నేను తలచుకుంటే ఈ గాలిని ఇప్పటికిప్పుడే ఆపగలను, మీ గ్రామానికి వర్షాలు రాకుండా చేయగలను. అగ్గి పుట్టించి మీ గ్రామం మొత్తాన్నీ క్షణంలో భస్మం చేయగలను! చూస్తావా, నా శక్తులు?!" అంటూ తన కమండలంలోని నీళ్లను చేతిలోకి వంచుకొని, ఏవేవో మంత్రాలు చదవటం మొదలు పెట్టాడు.

గ్రామస్తులంతా బెదిరిపోయారు. అందరూ ముసలాయనను తలా ఒక మాటా అన్నారు. ముసలాయన కూడా "అయ్యా! నన్ను క్షమించండి!" అంటూ స్వామికి సాగిలపడి, "అయ్యా! పెద్దవాళ్ళు చిన్నవాళ్ళకి నమస్కరించ కూడదట! అట్లా చేస్తే చిన్నవాళ్ళ ఆయుష్షు తగ్గిపోతుందట! అందుకే 'తమరి వయస్సు ఎంత?' అని ప్రశ్నించాను" అని చెప్పి వెళ్ళిపోయాడు.

స్వామి ఆ రోజు రాత్రి అంతా ఆ ఊర్లోనే బస చేసాడు. చిన్నల్నీ, పెద్దల్నీ ఎవ్వరినీ వదల్లేదు: అందరికీ ఆశీర్వాదాలిచ్చాడు. చివరికి, "నా పాదాలు కడిగిన నీళ్ళు మీ ఇళ్ళల్లోనూ, పొలాల్లోనూ చల్లుకోండి పోండి" అని ఆనతి ఇచ్చి, తెల్లవారుతుండగా ఆ గ్రామ పొలిమేరలు దాటాడు.

గాలి చల్లగా వీస్తోంది. వాతావరణం ప్రశాంతంగా వుంది. సూర్యుడు బంగారు కాంతులను కురిపిస్తున్నాడు. పక్షులు

కిలకిలారవాలు చేస్తున్నాయి. "ఆహా! ఇవి ఎంత మంచివి! అన్నీ నా కీర్తిని గానం చేస్తున్నాయి!" అనుకున్నాడు స్వామి.

అట్లా మరికొంత దూరం నడిచే సరికి దారికి ఇరువైపులా పూలు చెట్లు, పండ్ల చెట్లు కనిపించాయి. అవి స్వామిని చూసి ఏమీ అనలేదు. స్వామికి కోపం వచ్చింది. "ఎంత పొగరు వీటికి! నా వంటి తపస్వులు వస్తుంటే, ఇవేల, ఈ చెట్లు నేను నడిచేదారిలో పూలనెందుకు చల్లలేదు? ఈ ఫల వృక్షాలన్నీ వంగి మాకు తియ్యని పండ్లనెందుకు యివ్వలేదు? వీటి గర్వం అణచి వేయాల్సిందే"నని నీళ్ళు చేతిలోకి తీసుకొని మంత్రం చదవబోయాడు.

అంతలోనే గురువుగారి మాటలు గుర్తుకొచ్చాయి: 'అనవసరంగా ఎవరినైనా శపిస్తే, నువ్వు సంపాదించిన శక్తులు అంత మాత్రం వ్యర్థమైపోతాయి' అని. వెంటనే ఆ నీళ్ళను తానే త్రాగేసి, ఆ చెట్లను చూసి, "మిమ్మల్ని క్షమించాను బ్రతుక్కోండి పొండి" అంటూ ముందుకు సాగాడు.

ఆలోగా అటు ప్రక్కనే కొండ వారన ఒక గొర్రెల మంద, వాటిని కాచే గొర్రెల కాపర్లు కనబడినారు. "వీళ్లందరినీ ఆశీర్వదిస్తాను" అని సంకల్పించిన స్వామి వాళ్లకేసి తిరిగి కేక వేసాడు. వాళ్ళు కూడా 'ఎవరీ స్వామి?' అంటూ పరుగు పరుగున రాసాగారు.

ఆలోగా స్వామివారి చూపు గొర్రెలమీద పడింది. అవన్నీ తమ దారిన తాము పచ్చిక మేస్తున్నాయి. స్వామి వారికి బుగులు పుట్టింది. "ఇదిగో! ముమ్ముందు నా ఆశీర్వాదం వీటికి ఇవ్వాల్సిందే" అంటూ వాటివైపుకు నడిచాడు. "స్వామీ! స్వామీ! జాగ్రత్త!" అంటూనే ఉన్నారు కాపరులు. కానీ స్వామి వింటేగా?

"రండి! నాకు మోకరిల్లండి!" అంటూ గొర్రెల్ని బలవంతం చేయటం మొదలు పెట్టాడు.స్వామి వారి శరీరం నిండా విభూది రేఖలు, కుంకుమ బొట్లు ఉన్నాయి. చేతిలో కమండలం, మెడలో రుద్రాక్ష మాలలు! కాషాయరంగు పంచె కట్టినాడు. ఆయన వింత ఆకారాన్ని చూసే సరికి, గొర్రెలు బెదిరి,

ఎటుపడితే అటు పరిగెత్తటం మొదలు పెట్టాయి.




ఆ మందలోనే కొమ్ములు తిరిగిన పొట్టేలు ఒకటి ఉన్నది. అది ఆశీర్వాద స్వామిని తేరిపార చూసి. బుసకొట్టి, వెనక్కి పోయినట్లే పోయి, గబుక్కున వచ్చి, స్వామి మోకాళ్లను ఢీకొన్నది. స్వామివారు నేలమీద పడి "అమ్మా!" అని మొత్తుకోసాగారు. పరుగున వచ్చిన గొర్రెల కాపరులు, దొరికిన అడవి తీగలతో ఆయన రెండు కాళ్ళూ బిగించి కట్టి, ఆయన్ని ఎత్తుకొని గ్రామం వైపు పరుగు పెట్టారు.

వైద్యుడి దయవల్ల, వారం రోజుల తర్వాత మెలకువ వచ్చింది స్వామికి. చూస్తే ఎదురుగా, తనకు అంతకు మునుపు నమస్కరించిన ముసలాయన! ఆయన్ని చూస్తూనే ఆశీర్వాద స్వామిలోని అహంకారం కరిగి నీరైంది. లేచి ముసలి వైద్యుని పాదాలకు నమస్కరించి, క్షమించమని వేడుకున్నాడు.

అంతలో ఒక గొర్రెల కాపరి- "స్వామీ! మా గొర్రె పొట్టేళ్ళన్నీ మీ ఆశీర్వాదం కోసం బయట వరుసగా కాచుకొని ఉన్నాయి. మీ కమండలంలోకి నీళ్ళు పోయమంటారా?! అక్షింతలు కలిపి తెమ్మంటారా?!" అన్నాడు.

అహం కరిగిన స్వామివారు జవాబివ్వలేదు.. మౌనంగా తన కాళ్ల వైపు చూసుకుంటూ కూర్చున్నారు!

---

**పొడుపు కథలు!**

1. అంగట్లో కొంటారు ముందర పెట్టుకొని ఏడుస్తారు? ఉల్లిపాయ
2. చీర మీద చీర, పదహారు చీరలు? ఉల్లి పొరలు
3. కోట కాని కోట ? తులసికోట

*సేకరణ: P. పావని, 5వ తరగతి, వికాస విద్యావనం*

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**నిమ్మరసం, గాడిద, పాకిస్తాన్, బొమ్మలకథ, కొత్తపల్లి, ప్రజలు, సమయానికి, నాకెందుకు, కబుర్లు, మధ్యాహ్నం, భోజనాలు, జామచెట్టు, బయలుదేరాడు, రంగయ్య, తోడేలు, రాక్షసుడు, అకాశం, ధనుస్సు, పిచ్చుక, రాజు, :-** *ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాగున్నాయి-నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రింది నుండి పైకి -ఎటుపడితే అటు! వాటిని వెతికి వాటి చుట్టూ గుండ్రాలు* గీయండి!

| అ | బ | య | లు | దే | రా | డు | కెం | దు | కా | జు | ల |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ధ | మ | హ్నం | కొ | రా | ప్ర | జ | లు | మ్మ | రా | ఆ | చె |
| ను | ర్లు | త్త | ధ్య | యా | ట్టు | క | సం | కు | హ్నం | య్య | స |
| స్సు | ప | న్ | క్ష | స | చ్చు | ర | జ | ధ్యా | ధ | గ | కి |
| ల్లి | ధ్య | స్తా | మ | పి | మ్మ | డు | మ | స | బ | రం | ని |
| మ్మ | ప్ర | కి | తో | ని | సు | ధ | లు | మ | జ | ఆ | యా |
| సం | యా | పా | లు | క్ష | క | ద | డి | గా | చె | నా | మ |
| గ | ర్లు | డు | రా | లు | కి | యా | ర్లు | లు | కా | లు | స |
| భో | జ | నా | లు | ట్టు | కి | రా | బు | జు | లు | య | చె |
| బ | రా | గా | చె | బొ | మ్మ | ల | క | ధ | డే | డు | గ |
| చె | ధ | మ | జ | ప్ర | ఆ | దే | జు | కొ | తో | మ్మ | కు |
| స | జా | డు | ఆ | కా | శం | ద | గ | కు | దు | కెం | నా |

# పదరంగం-97

*నిర్వహణ: డా. సిరి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం*

| ★ | 1 | 2 | 3 | 4 | |
|---|---|---|---|---|---|
| 5 | | | | | ★ |
| 6 | | ★ | 7 | | 8 |
| 9 | | | ★ | ★ | |
| ★ | | ★ | 10 | ★ | |
| 11 | | | | | |

**నిలువు:**

1. ఊరికే వరాలిచ్చే శివుడి మరో పేరు (5)
2. దీర్ఘం పోయిన 'కాజా' తిరగబడింది (2)
3.' వానరుడు' లో దాగి వున్న మనిషి (3)
4. సత్కారాలు చేసినప్పుడు కప్పేది (3)
5. 'పుర్రె' మరోలా (3)
8. 'పలుమారు' 4,3,1,2 (4)
10. ఈ జీవం గొర్రె కాదు! (2)

**అడ్డం:**

1. భోజనం చేసే చోటు (5)
5. కళలు ప్రదర్శించే వారు (5)
6. 'యమపాశం' లో యమ మాయమైంది (2)
7. తడబడిన 'వరుడు' (3)
9. అటు నుండి వచ్చిన 'సకలం' (3)
11. కథలు కాని కథలు (6)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడులను నింపగలరేమో చూడండి. నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి. మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి. సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి - 93 ని బహుమతిగా పంపిస్తాం!

**మా చిరునామా:** కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, MRO ఆఫీసు దగ్గర, చెన్నే కొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101

RNI Regn No. : APTEL/2014/62705 Date Of Publishing: 25/02/2018 Postal Regn No: HDP/008/2018-2020

## నేనెందుకు హోం వర్కు చెయ్యలేదంటే...

*కెన్ నెస్బిట్ అమెరికన్ పిల్లల కవి. ఆయన పిల్లల కోసం హాస్య కవిత్వం రాస్తాడు. పిల్లల ఊహల్లాగే ఈయన కవితలు కూడా నమ్మశక్యం కాని సంఘటనలతోటీ, అద్భుతమైన సన్నివేశాలతోటీ మొదలయ్యి, చివరికి ఈ లోకంలోకి వస్తాయి. ఈయన కవితల్లో పిల్లలకి బాగా పరిచయమయిన సందర్భాలు ఎంచుకుంటాడు. చాలా కవితల్లో స్కూలుని, రూల్సుని, పెద్దవాళ్ళని అపహాస్యం చేస్తాడు. ఆయన రాసిన All my great excuses అనే కవితకి జి.వి.జి.కె.రాజు చేసిన అనువాదం ఇది...*

నేనెందుకు హోం వర్కు చెయ్యలేదంటే...

నేను హోం వర్కు చేద్దామనే అనుకున్నా,
కానీ నా పెన్నులో ఇంకు అయిపోయింది.
మా పెంపుడు ఎలుక నా పుస్తకం తినేసింది
మా ఇంట్లోనేమో కరెంటు అసలే పోయింది

నా హోం వర్కు పుస్తకం చెయ్యి జారి
పొయ్యి మీద రసంలో పడి కరిగిపోయింది
నేను వేరే పనిలో బిజీగా ఉన్నప్పుడు
మా చెల్లి దాన్ని మురిక్కాలవలో పడేసింది

మా అమ్మ పని తొందరలో కంగారులో
నా హోం వర్కు శుభ్రంగా ఉతికి ఆరేసింది.
విమానం ఒకటి మా ఇంటిమీద కూలిపడి
నా హోం వర్కు ఆ మంటల్లో కాలిపోయింది

సుడిగాలికి నా నోట్సు కొట్టుకుపోయాయి.
మా ఊళ్ళో అగ్నిపర్వతాలు బద్దలయ్యాయి
మాయల మరాఠీ ముఠా చేతులో
అందమైన నా పుస్తకాలు బందీలయ్యాయి.

నా మీద ఒక షార్కు దాడిచేసింది
వేరే గ్రహం వాళ్లు నన్ను ఎత్తుకుపోయారు
బందిపోట్లు నా హోం వర్కు దొంగిలించి
తిరిగివ్వమంటే కుదరదంటున్నారు

పని తప్పించుకోటానికి మంచి సాకుకోసం
ఇంత కష్టపడి నేను వెతుకుతున్నానా,
చూడండి, మా టీచరమ్మ-
"ఒరే బుజ్జీ,
దీనికన్నా, హోం వర్కే తేలికేమోరా!"
అని వెటకరించింది!!

“Kottapalli” Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.